# బొమ్మరిల్లు

సంపాదకుడు: విజయబాపినీడు

ప్రజల్లో చైతన్యం పుట్టించడం కోసం కొందరు విప్లవాలు లేవదీస్తారు. కానీ వారి నాయకత్వం కంటే మరణమే ప్రజల్లో చైతన్యాన్ని పుట్టిస్తుంది. ప్రతి ఒక్కరూ ఆలోచించి సవరించుకోవలసిన ఈ పొరపాటును "విప్లవం - చైతన్యం" కథలో ఎంతో నేర్పుగా ఎత్తి చూపడం జరిగింది.

పెద్దలు నీతులు చెబుతారు. సలహాలు ఇస్తారు. రెండింటికీ పొంతన కుదరనప్పుడు సమస్యలనెలా పరిష్కరించుకోవాలో "నీతి - సలహా" కథలో చమత్కార యుతంగా చెప్పబడింది.

ఉన్నవాడికి అన్నీ తెలియాలని లేదు. కానీ అన్నీ తెలుసునని ఒప్పుకోవడంలోనే లేనివాడికి లాభముంది. అదెలాగో తెలుసుకుందుకు "జ్ఞానదరిద్రుడు" కథలో పాపన్నను కలుసుకోండి.

-వసుంధర

సంపుటి: 27 సెప్టెంబర్ 1998 సంచిక: 9

విడిప్రతి రూ. 6.00 సంవత్సర చందా: రూ. 72.00

# పంట చేలు విడచి పరిగ ఏరుకున్నట్లు...

(సామెత కథలు-97)

పాలకొల్లు గ్రామంలో పరమేశ్వర శాస్త్రి సకల శాస్త్ర పారంగతుడు. ఆయన వద్ద ఎందరో విద్యాభ్యాసం చేసి ఎంతో పేరు తెచ్చుకున్నారు.

ఎన్నో సుగుణాలున్న పరమేశ్వర శాస్త్రికి చందమామలోని మచ్చలా నశ్యం పీల్చే దురల వాటుంది. భార్య పార్వతమ్మ ఎంత చెప్పినా ఆయన దాన్ని వదలలేదు.

కొత్తగా ఆయనకు శిష్యుడైనా గోపాలుడికి ఆయన చెప్పే చదువు ఎక్కేది కాదు. మధ్య మధ్య ఆయన నశ్యం పీలుస్తూంటే వాడికి ఆసక్తికరంగా అనిపించి తనూ అలా చేస్తే చదువొస్తుందనుకున్నాడు. ఒక రోజున వాడు గురువుగారి నశ్యం డబ్బీ దొంగిలించి చాటుగా నశ్యం పీల్చగా ఆ ఘాటుకు ఆగకుండా తుమ్ములు వచ్చాయి. అంతే, దొంగ దొరికి పోయాడు.

పార్వతమ్మ గోపాలుణ్ణి మందలిస్తూ, 'గురువు దగ్గర శాస్త్రాలు నేర్చుకోవాలిగానీ నశ్యం అలవాటు నేర్చుకుంటావా? పంట చేలు విడచి పరిగ ఏరుకున్నట్లుంది నీ విషయం-" అన్నది.

గోపాలుడికి తన తప్పు అర్థమై ఆ రోజునుంచీ చదువు మీదనే దృష్టిని కేంద్రీకరించసాగాడు. పరమేశ్వర శాస్త్రి కూడా శిష్యులను పెడదారి పట్టించే దురలవాటు తనకెందుకుండాలని క్రమంగా నశ్యం అలవాటుకు స్వస్తి చెప్పాడు.

-జ్యోతిర్మయి

# కాంగ్రెసు అన్నలకో విన్నపం

ప్రపంచంలోకల్లా అతిపెద్ద ప్రజాస్వామ్యం భారతదేశానిది. పలు భాషా రాష్ట్రాల కూటమి అయిన ఈ దేశాన్ని 1947లో స్వతంత్రం వచ్చినప్పట్నించీ అవిచ్ఛిన్నంగా పరిపాలిస్తోంది కాంగ్రెస్ పార్టీ. అయితే ఆ పార్టీ నినాదాలకూ, రాజరికానికీ ఎక్కువ ప్రాధాన్యత నివ్వడంవల్ల దేశానికి ప్రజాస్వామ్యపు లాభాలు చేకూరవలసినంతగా రాలేదు.

కాంగ్రెసు పార్టీ మొదటి లోపం నాయకత్వం. భారతీయుల ప్రియతమ నాయకుడు చాచా నెహ్రూ తనకు తానుగా అంతర్జాతీయ ఖ్యాతినార్జించినా పార్టీ పగ్గాలను చేపట్టడానికి సర్వజనామోదం పొందగలిగిన మరో నాయకుడిని తయారు చేయలేకపోయాడు. ఫలితంగా రాజరికం తీరులో - తలలు పండిన పెద్దలను తలదన్ని - అనుభవంలో పిన్న అయిన - నెహ్రూ కుమార్తె ఇందిర దేశానికి ప్రధాని అయింది. క్రమంగా ఆమె కూడా అంతర్జాతీయ ఖ్యాతినార్జించింది. జనం ఆమెను ఎంత గుడ్డిగా ఆరాధించారంటే- తాత్కాలికంగా ఆమె ప్రభుత్వాన్ని కూల దోయడానికి- ఆమె తన భస్మాసురుణ్ణి తానే ఎమర్జన్సీ రూపంలో సృష్టించుకుంది. చివరికామెను అంగరక్షకులే హత్య చేశారు. అప్పటికీ కాంగ్రెసులో దేశాన్నేలడానికి అనుభవ శూన్యుడైన రాజీవ్‌గాంధీ తప్ప మరో నాయకుడు లేడు. రాజీవ్ నాయకత్వంలో కాంగ్రెసు పై ప్రజల అభిమానం తొందరగా సమసిపోయింది. ఆయన మరణమే కాంగ్రెసుకు పునర్జీవితాన్నివ్వగా- గృహిణిగా మాత్రమే జీవితాన్ని కొనసాగిస్తున్న రాజీవ్ అర్ధాంగి సోనియా కాదనడంవల్లనే- పివి నరసింహారావు భారత ప్రధాని కాగలిగారు. నెహ్రూ, ఇందిర, రాజీవ్‌ల నాయకత్వాలకు లేని సవాళ్ళను ఎదుర్కుంటూ 1991లో ప్రధాని అయిన పీవీ నరసింహారావు అయిదేళ్ళ పాటు మనగలగడం ఆయన చాణక్యనీతికి నిదర్శనం. ఆ అయిదేళ్ళూ కాంగ్రెసు పార్టీ అంతర్గత వ్యవహారాలు చూస్తే ఒక్క విషయం స్పష్టమవుతుంది.

(ఈ శతాబ్దపు చివరి దశాబ్దం - 97)

పార్టీ ప్రజలకెంత మేలు చేస్తున్నదీ ఆ పార్టీ పట్టించుకోదు. నాయకుడి ప్రతిభాసామర్థ్యాలతో ఆ పార్టీకి పనిలేదు. నాయకుడిది నెహ్రూ వంశమై ఉండాలి. అంతే!

1996లో జరిగిన ఎన్నికల్లో ప్రజలు కాంగ్రెసు పార్టీని తిరస్కరించారు. అప్పుడు కాంగ్రెసు పార్టీలోని రెండవ లోపం బయట పడింది. మన దేశం అన్ని మతాలనూ సమంగా ఆదరిస్తుంది. సెక్యులరిజం అని దీనికి వ్యావహారిక నామం. అయితే కాంగ్రెసు పార్టీ దృష్టిలో సెక్యులరిజం అంటే ముస్లిములను గారాము చేయడం. అదీ వారిపై అభిమానంతో కాదు. ఓట్ల కోసం. అందువల్ల భారతదేశంలోని ముస్లిములు తాము మైనారిటీలమన్న భావాన్ని పెంపొందించుకుంటున్నారు. ప్రతి ఒక్కడూ భారతీయుడైన ఈ దేశంలో కులం, జాతి, భాష వగైరాలతో తమలో తాము కలహించుకునే హిందువుల్లో ఏ తెగా అయిదారు కోట్లకు మించి లేనప్పుడు మతం పేరుతో తామందరూ ఒక్కటై ఇతరులకు ఆదర్శంగా నిలచే సుమారు ఇరవై కోట్ల ముస్లిములను మైనారిటీ అనడం రాజకీయం తప్ప మరేమీ కాదు. ఆ విధంగా చూస్తే ప్రతి రాష్ట్రంలోనూ బ్రాహ్మణులకూ, ఇతర అగ్ర కులాలనూ కూడా మైనారిటీలుగా భావించక తప్పదు. భారతదేశంలో భారతీయులే తప్ప మైనారిటీలు, భిన్న కులాలు, భిన్న జాతులు, భిన్న భాషలు ఉండకూడదు. ఇంతవరకూ అవి నశించకుండా పెంపొందాయంటే అధిక కాలం దేశాన్నేలిన కాంగ్రెసు అందుకు బాధ్యత వహించాలి.

1991లో కనీసం మొదటి రెండున్నర సంవత్సరాలూ ప్రజామోదం పొందినా రాజకీయ అపస్వరాలతో మతతత్వశక్తిగా పేరుపడ్డ భారతీయ జనతా పార్టీ సహకారంతోనే కాంగ్రెసు పార్టీ ప్రభుత్వాన్నేల గలిగింది. 1996లో కాంగ్రెసు పార్టీ- అధిక సంఖ్యలో ఉన్న భారతీయ జనతా పార్టీని కాదని ఓ సంకీర్ణ ప్రభుత్వాన్ని సమర్థించి పద్దెనిమిది నెలల తేడాలో రెండు ప్రభుత్వాలను కూలదోసింది. అవసరమైన సహకారాన్ని నమ్మకంగా అందించలేకపోవడం కాంగ్రెసు పార్టీ మూడవ లోపం.

ఇన్నీ, మరిన్నీ లోపాలతో ఉన్న కాంగ్రెసు పార్టీ ధోరణి ఏ మాత్రమూ మారలేదనడానికి సూచనగా ఆ పార్టీ పగ్గాలనిప్పుడు రాజరికం ప్రాతిపదికలో సోనియా గాంధీకి అప్పజెప్పింది. తను ప్రభుత్వాన్నేర్పాటు చేయలేనని తెలిసీ వాజపేయి నేతృత్వంలోని ప్రభుత్వాన్ని కూల్చడానికో విఫల యత్నం చేసింది. భారతీయ జనతా పార్టీలో లోపాలుంటే అదుపు చేయడానికి తమ సంఖ్యా బలాన్నుపయోగించిన ఏఐఏడీఎంకే, సమత, త్రిణాముల్ లోకశక్తి, తెలుగు దేశం వగైరాల రాజనీతిని ఆదర్శంగా తీసుకుని దేశానికి సుస్థిర ప్రభుత్వాన్ని అందించమని భారత పౌరులు కాంగ్రెసు అన్నలకు విన్నవిస్తున్నారు. - వసుంధర



# నిజమైన ప్రేమికుడు

ఉదయగిరి రాజు విక్రమసింహుడికి త్రినాథుడొక్కగానొక్క కొడుకు. పొరుగునే ఉన్న కళ్యాణపురం రాజు కీర్తివర్మకు ఒక్కగానొక్క కూతురు. రెండు రాజ్యాలూ ఒక్కటై విశాల సామ్రాజ్యం స్థాపించడానికి త్రినాథుడికీ, అతులితకూ పెళ్ళి చేస్తే బాగుంటుందని వారి తలిదండ్రులు అనుకునేవారు.

అయితే అతులిత ఆలోచనలు వేరే ఉన్నాయి. తనను వివాహమాడే వాడు తనకోసం ఏమైనా చేయగల సాహసవంతుడు కావాలని ఆమె కోరిక. అందుకని విజిగిఘారణ్యంలో కురియా తెగకు చెందిన చెంచులు కొలిచే కిచోరా దేవత విగ్రహం తలపై ఉండే కిరీటాన్ని తెచ్చిపెట్టమని ఆమె త్రినాథుణ్ణి కోరింది.

తన ప్రేమను నిరూపించుకుందుకు త్రినాథుడు వెంటనే బయల్దేరి విజిగిఘారణ్యం చేరుకుని అలసటతో ఓ చెట్టుకింద విశ్రమించాడు. అతడు మంచి నిద్రలో ఉన్న సమయంలో కురియా చెంచులు వచ్చి అతణ్ణి బంధించి తమ నాయకుడు తబుకా ముందుంచారు. తబుకా అతడిని ఓ గుడిసెలో ఖైదు చేయించాడు.

తబుకా కుమార్తె లివోనా అందాల రాశి. ఆమె రోజూ త్రినాథుడికి భోజనం పెట్టేది. తన ముందు సిగ్గుపడుతూ, ఓర చూపులు చూసే లివోనా తనను ప్రేమిస్తున్నదని త్రినాథుడనుకున్నాడు. ప్రతిరోజూ అతడామె అందాన్ని పలురకాలుగా పొగుడుతూండేవాడు. ఆమె సాయంతో ఎలాగో అలా తన కార్యం సాధించాలని అతడి ఆశ.

త్రినాథుడామెకు తాను ఉదయగిరి రాజకుమారుడిననీ ఆమె తనతో వచ్చే మాటైతే రాణిని చేసి వైభోగాల్లో ముంచెత్తుతాననీ చెప్పాడు. అప్పుడు లివోనా అతడితో, "ఇక్కణ్ణించి తప్పించుకోవాలంటే ఒక్కటే మార్గం. ఎల్లుండి పున్నమినాడు కొత్త నాయకుడి ఎన్నిక జరుగుతుంది. మా గూడెంలో షికోరాను మించిన బలవంతుడు లేడు. అతణ్ణి నువ్వోడిస్తే నీవే మా నాయకుడివౌతావు. అంతా నీమాట వింటారు. నీవోడిపోతే మాత్రం నిన్ను కిచోరా

- గుండ్రాతి సుబ్రహ్మణ్యం గౌడు



దేవతకు బలి యిస్తారు" అని చెప్పింది.

"నేను చెంచును కాదు. పైగా మీఖైదీని. నాకు షికోరాతో పోరాడే అవకాశం వస్తుందా?" అన్నాడు త్రినాధుడు అనుమానంగా.

"ఆ రోజుకు నీవు వేషం మార్చుకుని మాలో ఒకడిలా కలిసిపోయే ఏర్పాటు నేను చేస్తాను" అంది లివోనా.

పున్నమి వచ్చింది. కొత్త నాయకుడి కోసం బలపరీక్ష జరిగింది. షికోరా ముందు ఏ చెంచు యువకుడు నిలబడలేక పోయాడు. అప్పుడు త్రినాధుడు ముందుకు వచ్చి పోటీలో పాల్గొంటా నన్నాడు. అతడు కూడా చెంచు యువకుడే ననుకుని తబుకా అందుకంగీకరించాడు.

అప్పుడు త్రినాధుడు తన చెంచు రూపాన్ని తొలగించి, "నేను ఉదయగిరి రాకుమారుడు త్రినాధుణ్ణి. లివోనా సాయంతో చెంచునయ్యాను. మీరు మాట తప్పకుండా నన్ను షికోరాతో పోటీ పడనివ్వండి. నెగ్గితే షికోరాను ఉదయగిరికే రాజును చేస్తాను" అన్నాడు.

"నీవు చెంచువు కాదు కాబట్టి ఓడితే నిన్ను కిచోరాకు బలియిస్తాం" అన్నాడు తబుకా. త్రినాధుడు సరేనన్నాడు.

త్రినాధుడు సకల శాస్త్ర పారంగతుడు. ఎన్నో యుద్ధ విద్యలను క్రమపద్ధతిలో నేర్చుకున్నాడు. చెంచుల యుద్ధ పద్ధతులు కూడా అతడికి తెలుసు. షికోరాను అతడు సులభంగా ఓడించాడు.

అప్పుడు తబుకా అతడి ముందు మోకరిల్లి, "నేటి నుండీ నీవే మా ప్రభువ్వి. మేము నీ ఆజ్ఞమీరం" అన్నాడు.

"నాకు మీ కిచోరా దేవతకు శిరోభూషణమైన కిరీటం కావాలి. అది తీసుకుని నేను వెళ్ళిపోతాను. ఇక్కడ షికోరా నాప్రతినిధిగా మీకు నాయకుడిగా ఉంటాడు" అన్నాడు త్రినాధుడు.

తబుకా అందుకు సంతోషంగా అంగీకరించాడు కానీ కిచోరాకు నిత్యపూజలు జరిపే అర్చకుడు వాగులా మాత్రం అందుకు అభ్యంతరం చెబుతూ, "ఆ కిరీటం తీస్తే దేవతకు ఆగ్రహం వస్తుంది. మన గూడెం ప్రజలు అష్టకష్టాల పాలవుతారు" అన్నాడు. తబుకా మాత్రం, "దేవత దీవెనతోనే త్రినాధుడు మనకు ప్రభువయ్యాడు. ఆయన మాటకు మనం ఎదురు చెప్పకూడదు" అన్నాడు.

అప్పుడు వాగులా త్రినాధుడితో, "దొరా! నువ్విక్కడ

రెండు మూడ్రోజులుండు. ఏ అనర్థమూ జరక్క పోతేనే కిరీటాన్ని తీసుకుని వెళ్ళు" అన్నాడు.

త్రినాథుడు దేవత కిరీటాన్ని తీసుకుని తన వద్ద ఉంచుకున్నాడు.

ఆ రాత్రి వాగులా అక్కడి మంచినీటి కొలనులో ఏదో మందు కలిపాడు. ఆ నీరు త్రాగిన ప్రజలకు మర్నాటికల్లా కడుపు నొప్పి బయల్దేరింది. అంతా అది దేవత ప్రభావమే నన్నారు.

ఆ కడుపునొప్పి త్రినాథుడికీ వచ్చింది. ఆ లక్షణాలను బట్టి అది నీటి ద్వారా వచ్చిన జబ్బు అని అతడు గ్రహించాడు. అడవి నుంచి కొన్ని మూలికలు తెప్పించి వెంటనే కొలను నీటిలో కలిపించాడు. ఆ నీరు సేవించగానే త్రినాథుడికీ, లివోనాకూ ఆ జబ్బు తగ్గిపోయింది. మిగతి చెంచులకు మాత్రం తగ్గలేదు.

చెంచులు అమితంగా బాధపడుతూ, "ఆ కిరీటాన్ని తిరిగి దేవత తలపై ఉంచితే తప్ప మా కష్టాలు తీరవు" అనిరోదించసాగారు.

పరిస్థితి త్రినాథుడికి అర్థమయింది. అతడు కిరీటాన్ని తిరిగి దేవత తలపై ఉంచాడు. మర్నాటి కల్లా చెంచులందరూ స్వస్థులయ్యారు.

త్రినాథుడు జరిగినదంతా షికోరాకు చెప్పి, "మూఢ నమ్మకాలు చాలా ప్రమాదకరమైనవి. మందు నాకు పనిచేసింది. నన్ను నమ్మిన లివోనాకు పని చేసింది. కానీ దేవతకు అపచారం జరిగిందన్న అను మానమున్న వారెవ్వరికీ ఆ మందు పనిచేయలేదు. ఇక మీదట ప్రజల్లో ఇలాంటి మూఢ నమ్మకాలు లేకుండా చేయాలి. అది ఒక్క రోజుతో వచ్చే మార్పు



కాదు. క్రమంగా రావాలి" అన్నాడు.

షికోరా ఆశ్చర్యంగా, "నన్నొక్క అనుమానం పీడిస్తున్నది. ఇంతకాలం మేము కొలను నీటిని సేవిస్తూ సుఖంగా ఉన్నాం. ఒక్క రాత్రిలో ఆ నీటిలో మార్పు ఎందుకు వచ్చింది?" అన్నాడు.

"అది వాగులాయే చెప్పాలి. అనర్థం జరిగి తీరు తుందని అంత ఖచ్చితంగా చెప్పాడంటే అందుకు తనే ఏదో చేసి ఉండాలి" అన్నాడు త్రినాథుడు.

వాగులాను నిలదీయగా నిజం ఒప్పేసు కున్నాడు.

అప్పుడు త్రినాథుడు, "ఒక్కరోజుతో ప్రజల్లో మార్పురాదు కాబట్టి మీ దేవత కిరీటాన్ని మీకే వదిలి వెడుతున్నాను. అందువల్ల నేను ప్రేమించిన అతులితను పెళ్ళాడే అవకాశం పోతోంది. అయినా నేను విచారించను. అన్నమాట ప్రకారం లివోనాను

పెళ్ళాడాల్సిన బాధ్యత నామీద ఉన్నది" అన్నాడు.

లివోనా వెంటనే, "యువరాజా! నేను నిన్నెప్పుడూ ప్రేమించలేదు. పెళ్ళాడమని అడగలేదు. కాబట్టి నా బాధ్యత నీకు లేదు. నేను నిజానికి షికోరాను ప్రేమిస్తున్నాను. అతడు నన్ను నిర్లక్ష్యం చేస్తే నాలో అందం లేదేమోనని అనుమానం పుట్టింది. అది తీర్చుకుందుకే నీతో ప్రేమగా మసిలాను. నీవు నీ రాజ్యానికి తిరిగి వెళ్ళు. షికోరాకు నామీద ప్రేమ పుట్టేదాకా నేనిక్కడే ఎదురు చూస్తూంటాను" అంది.

త్రినాథుడాశ్చర్యపడి, "నాగరీక సామ్రాజ్యానికి రాణివి కాగలగీ, ప్రేమకోసం ఆ అవకాశం వదులుకుంటున్నావు. నీ ప్రేమ నిజంగా గొప్పది" అన్నాడు.

అప్పుడు షికోరా, "అయ్యో, నేను లివోనాను ప్రేమించకపోవడమేమిటి? గూడేనికి నాయకుడినయ్యేదాకా ఆడదానివైపు కన్నెత్తి చూడకూడదనుకున్నాను. అంతే!" అన్నాడు.

త్రినాథుడి ఆధ్వర్యంలో షికోరా, లివోనాల పెళ్ళి జరిగింది. ఆ తర్వాత అతడు అతులితను కలుసుకుని జరిగింది చెప్పాడు.

అతులిత అతడితో, "రెండు రాజ్యాలు ఒక్కటై విశాల సామ్రాజ్యం ఏర్పాటు కావడం కోసం మన పెళ్ళి ఉద్దేశించబడింది. విశాల సామ్రాజ్యంలో భిన్న జాతులు, మతాలు, నమ్మకాలు ఉంటాయి. అన్నింటినీ సమదృష్టితో చూస్తూ పరిరక్షించగల వాడే ఆదర్శ ప్రభువు. నాకోసం ప్రాణాలకు తెగించి విజగి ఘారణ్యం వెళ్ళి నా మీద ప్రేమను నిరూపించుకున్నావు. దేవత కిరీటాన్ని వెనక్కిచ్చి చెంచులపై ప్రేమను నిరూపించుకున్నావు. ఇచ్చిన మాటకోసం లివోనాను పెళ్ళాడతానని సత్ప్రవర్తనపై నీప్రేమను నిరూపించుకున్నావు. నీవంటి వాడి ప్రేమలోనే ప్రియురాలికి, ప్రజలకు, మంచితనానికి రక్షణ ఉంటుంది. నాకు నువ్వు నచ్చావు. నీతో పెళ్ళికి మనస్ఫూర్తిగా అంగీకరిస్తున్నాను" అని చెప్పి సిగ్గుతో తలవాల్చింది.

ఆ తర్వాత వారిద్దరూ దంపతులై కలకాలం సుఖంగా జీవించారు.





# శివపార్వతీయం

(గత సంచిక తరువాయి)

## 17

కొంతసేపటికి అత్రిమహర్షి "ఇంతకూ ఏ విషయంలో త్రిమూర్తులను పరీక్షించాలో అది తేల్చరేం? శక్తిలోనా, గుణంలోనా, ఔదార్యంలోనా, అనుగ్రహంలోనా?" అన్నాడు.

నారదుడు చిరునవ్వుతో "మాకందరికీ మాతృ సమానురాలైన అనసూయాదేవిని యినుపశెనగలను గుగ్గిళ్లుగా వండి పెట్టమని, తీరా తన పాతివ్రత్య ప్రభావంతో వాటిని వండిన ఆ సతీమతల్లిని మరింతగా పరీక్షించాలని ఒంటి మీద నూలుపోగు లేకుండా వడ్డించమని కోరి, ఆమెవల్ల పసిపిల్లలుగా మారి కేరింతలు కొట్టిన ఆ త్రిమూర్తులకే యిప్పుడు పరీక్ష ఎదురైంది కదా?" అన్నాడు.

అప్పుడా పని చేయించిందీ, యిప్పుడీ పని చేయిస్తున్న ఘనుడివి నువ్వే కాని, త్రిమూర్తులను ఏ గుణంలో పరీక్షించాలో తేల్చమని అత్రి మునీంద్రులు అడుగుతున్నారు కదా? అది చెప్పవయ్యా, తగవుల తిండి కడుపయ్యా!" అన్నాడు భృగువు నవ్వుతూ. "నారాయణ - నారాయణ - నా తగవులు లోక కల్యాణానికే కదటయ్యా ముక్కోపి మునెయ్యా!" అన్నాడు నారదుడు.

"అంటే- యిప్పుడు నువ్వు తలపెట్టిన యీ సాహస కార్యక్రమం కూడా లోక కల్యాణం కోసమేనంటావా నారదా?" అన్నాడు రోమపాదుడు నవ్వుతూ.

"ఒక్క లోక కల్యాణమేమిటి? సర్వలోకాల కల్యాణం కాకూడదూ? కల్యాణ పరంపరలకు శ్రీకారం కాకూడదూ? భవిష్యత్తును ఆ భాగ్యానికి నోచుకోనిద్దాంగాని- త్రిమూర్తులను ఏ విషయంలో పరీక్షించాలని కదూ అత్రిమునీంద్రుల సందేహం! మనం చేయనున్నది 'శాంతి' యజ్ఞం! కాబట్టి సహన గుణాన్నే పరీక్షకు పెడదాం" అన్నాడు నారదుడు.

"ఏది చేసినా, ఏది చెప్పినా, ఒక్క నారదుడికే

కిరణ్‌కుమారి



చెల్లు! విశ్వశాంతి యజ్ఞానికి హవిర్భోక్త కాబోయే దేవతా శ్రేష్ఠుడు అత్యంత సహన శీలియై వుండటం సమంజసం. దీనికి మీరంతా అంగీకరిస్తున్నారా?" అన్నాడు గాలవ మహర్షి.

అందరూ ముక్త కంఠంతో అంగీకరించారు.

"ఇక యీ పరీక్షకు వెళ్లే ముని మొనగాడెవరో నిర్ణయించండి"- అన్నాడు చ్యవనుడు.

"ఇంకెవరు? కోపతాపాలతోబాటు తపో తపాలను కూడా తనలో యిముడ్చుకున్న ప్రచండ శక్తి వంతుడు- భృగుమహర్షీంద్రుడే?" అన్నాడు నారదుడు.

భృగువు నివ్వెరపాటుతో "నారదా! చివరకు కొరివి కట్టెను నా తలమీదకే తెచ్చావా తండ్రీ?" అన్నాడు నవ్వుతూనే.

"అరిపాదంలో జ్ఞానవంతమైన కన్ను కలిగిన మీ తలమీదకు కొరివి కట్టెను తెచ్చినా, దాని ప్రభావం దిగదుడుపే కదా తండ్రి తండ్రీ!" అన్నాడు నారదుడు.

"హు, నీ కన్ను నా పాదంలోని కన్ను మీద పడిందన్నమాట! హరి - హరీ యిక నువ్వే దానిని కాపాడాలి!" అన్నాడు భృగువు.

"తప్పకుండా ఆ హరి కాపాడుతాడుగాని, ఆ అరిపాదం కంటివల్ల సర్వజ్ఞుడిననే, సాటిలేని మేటి ప్రతిభా సంపన్నుడిననీ, భృగు మహర్షికి అహంకారం అని చాలా మర్యాదగా చెప్పుకుంటూండగా విన్నాను. భృగుముని చంద్రుడు నిగర్వి అనినేంటం కాదు- పరమ గర్విష్ఠి అని ఎంతో మంది నాతో వాదించారు కూడా. వారికందరికి గుణపాఠం నేర్పినట్లు వుంటుంది, మీ కీర్తి దశదిశలా యింకా వ్యాపించినట్లు వుంటుంది కాబట్టి, మీరే యీ పరీక్షకు పూనుకోవాలి. మీకు తప్ప యిక్కడ యింకెవరికీ ఆ దమ్ములు లేవు" అన్నాడు నారదుడు.

నారదుడు భృగువును ఏ వుద్దేశ్యంతో ఆ విధంగా ఆకాశానికెత్తి వేస్తున్నాడో అర్థం చేసుకున్న అక్కడి మునులంతా "అవును. చండ ప్రచండ తపోధనుడైన భృగువే త్రిమూర్తుల సహన శక్తిని పరీక్షించాలి" అన్నారు ఐక్య కంఠంతో.

భృగువు "మీకందరికి నా మీద గల నమ్మకానికి కృతజ్ఞుణ్ణి. యిప్పుడే ఆ కార్యసాధనకు బయలు దేరుతున్నాను"- అని చెప్పి తన తపశ్శక్తితో మరుక్షణం అంతర్థానుడయ్యాడు!

చరాచర విశ్వసృష్టికి రూపురేఖలు నిర్దేశించే సత్యలోకం అది! ప్రతిప్రాణికి ఆయుర్దాయంతోబాటు, ఆ ప్రాణి జీవిత గమన సరళిని కూడా "తలరాత"గా ఉల్లేఖించే అధికారం అక్కడే వుంది. ఆ లోకానికి అధిపతి బ్రహ్మ.

బ్రహ్మ అర్ధాంగ లక్ష్మి- చదువుల తల్లి సరస్వతి. తను సృష్టించిన కన్యమీదే తానే మనసు పడి బ్రహ్మ ఆ అందాలరాశిని పత్నిగా స్వీకరించాడు. సరస్వతికి 'శారద' అనే మరో పేరు కూడా వున్నది. సంగీతంలో కూడా సరస్వతి అద్వితీయురాలు. ప్రత్యేకించి వీణ మీటుతూ ఆమె గానం చేస్తూండగా, రాళ్లు సైతం కరిగిపోతాయని ప్రతీతి.

బ్రహ్మ నాలుగు వేదాలను రచించిన మహాజ్ఞాని. ధర్మార్థకామమోక్షాలు ఎప్పుడెప్పుడు ఏయే పాళ్లలో వుండాలో చాటి చెప్పే ఉపనిషత్తులు కూడా వేదాలకు అను సంధానంగా బ్రహ్మ సృష్టించినవే!

త్రిమూర్తులలో బ్రహ్మస్థానం సృష్టికార్యాలకు, ప్రాణికోటి జీవిత గమనాలకు మాత్రమే పరిమితం. అప్పుడప్పుడు రాక్షసులు, మునులు, దేవతలు, తనను గురించి తపస్సులు, యజ్ఞయాగాదులు చేస్తే, ప్రత్యక్షమై కోరిన వరాలను ప్రసాదించే శక్తి విష్ణు మహేశ్వరులతోబాటు బ్రహ్మకు కూడా వున్నది.

అటువంటి బ్రహ్మ ఆ దినం సరస్వతీదేవి ఒడిలో తల ఒంచి, ఆమె వీణమేళవించి చిగురుటాకుల వంటి చేతుల్తో తంత్రులను మనోహరంగా మీటుతూ, గానం చేస్తూంటే పరవశుడై వింటున్నాడు. తానొక సృష్టి కార్యనిర్వహణాధి కారిననీ, వేద వేదాంగ ఉపనిషత్తులను రూపొందించిన ప్రజ్ఞాశాలి అనీ, బ్రహ్మకు ఒకింత గర్వం అనీ, ఆ గర్వంవల్లనే అప్పుడప్పుడు పొరబాట్లు చేస్తూంటాడని బ్రహ్మ





అప్పటికీ సమాధానం లేకపోవడంతో, భృగువు అడుగులు ముందుకు వేసి వాళ్ల ముందు నిలిచాడు.

అయినా- ఏదో స్వప్నలోకంలో వున్నట్లు కన్నులు అరవారగా మూసి, అలవోకగా చిద్విలాసాన్ని అనుభవిస్తూన్న బ్రహ్మ అతడి రాకను గుర్తించలేదు.

సరస్వతి యథావిధిగా సంగీతం పాడుతూనే వున్నది. భృగువు అంత సమీపం నుంచి కూడా మరోసారి బిగ్గరగా పిలిచాడు!

ఆ పిలుపుకు కూడా సమాధానం లేదు!

భృగువు భృకుటి ముడివడింది!

కోపంతో శరీరం కంపించింది!!!

తాపసం తామసాన్ని కొని తెచ్చుకొంది!!

"ఔరా! శ్రాపానుగ్రహ సమర్థుణ్ణి, సప్తర్షి గణంలో సముణ్ణి, అభ్యాగతిగా వచ్చిన వాణ్ణి అయిన నన్ను యింత నిర్లక్ష్యం చేస్తారా? పామరుల వలె వినోద లీలా క్రీడల్లో యింతగా మునిగి తేలేవానికి సృష్టి కార్య ధర్మాన్ని నిర్వహించే అర్హత యెక్కడుంది. లే- లేచి, నా రాకను గుర్తించు" అని భృగువు బ్రహ్మ చెయ్యి పట్టుకుని సరస్వతి ఒడి నుంచి ఒక్క ఉదుటున ప్రక్కకు లాగి వేశాడు.

ఉట్టిపాటుగా సంభవించిన ఆ సంఘటనకు బ్రహ్మ విస్తుపోతూ లేచి నిల్చున్నాడు!

సరస్వతి వీణను ప్రక్కన పెట్టి నిల్చున్నది. భృగువు ఉగ్రరూపం చూసి యిద్దరూ నివ్వెర పోయారు!

అంతలోనే తమాయించుకున్న బ్రహ్మ తీవ్ర స్వరంతో "భృగుమహర్షీ! నువ్వెంత తపోధనుడివైనా,

మానస పుత్రుడైన నారదుడు విమర్శించటం కద్దు!

నారదుని విమర్శను సార్థకం చేయటానికా అన్నట్లు ఆ సమయంలోనే, నైమిశ నుండి అంతర్థానుడైన భృగువు అక్కడ సాక్షాత్కరించాడు.

సంగీతం పాడుతూ సరస్వతీ. ఆ సంగీతం వింటూ బ్రహ్మ, భృగువు రాకను గమనించ లేకపోయారు!

"నమో బ్రహ్మ దేవాయ" అన్నాడు భృగువు.

సరస్వతి సంగీతం చాలించలేదు!

బ్రహ్మ తల త్రిప్పి చూడలేదు!!

"చతురాననా!" కాస్త పెద్ద స్వరంతో పిలిచాడు భృగువు. తనవేపు చూడటంగాని, స్వాగతంగాని లేక పోవటంతో భృగువు మరింత స్వరాన్ని పెంచి "బ్రహ్మ దేవా!" అన్నాడు.

ఏమిటీ అనుచిత ప్రవర్తన? ఏకాంతంలో వున్న సతీపతుల మధ్య రావచ్చునా? పైగా నన్ను చెయ్యిపట్టి లాగటం నీ ధూర్తస్వభావానికి నిదర్శనం" అన్నాడు.

భృగువు ప్రళయకాల వలాహకంలా గర్జిస్తూ "హూం, నువ్వొక పతివీ, యీమె ఒక సతి! వావివరుసలు విడనాడి కన్న కూతురినే కామంతో కట్టుకున్న ముదు సతీ! నిన్ను చెయ్యి పట్టి లాగటమే కాదు- యీడ్చి పెట్టి చెంప పగల గొట్టినా దోషం లేదు! అఖిల లోకాల సృష్టికి అధిపతినన్న నీ అహంకారం యిప్పుడు ప్రస్ఫుటమైంది. నా వంటి విలయ రుద్రు ముద్రితుడైన మహాముని కోపాగ్ని జ్వాలలకు మహామహులే మట్టి కరిచారు. ఆ సంగతి గుర్తుంచుకుని నాతో మాట్లాడు" అన్నాడు.

బ్రహ్మ భృగువును చురుచురా చూస్తూ, "చాలించు నీ అధిక ప్రసంగం. చేసిన తప్పుకు క్షమాభిక్ష కోరకుండా, యింకా నీదే పై చేయి అనిపించు కోవాలనుకుంటున్నావా? నీ కళ్లకు నేనెలా కని పిస్తున్నాను?" అని గద్దించాడు.

భృగువు రెచ్చిపోయాడు!

"నా కళ్లకు ఒక కాముకుడుగా, భోగిగా, వృద్ధరసికుడుగా కనిపిస్తున్నావు. చాలా, యింకా చెప్పాలా?" అన్నాడు.

"ఛీ- అసందర్భ ప్రలాపీ! యిక్కడికేం పనిమీద వచ్చావో చెప్పి, గౌరవంగా వెళ్లిపో" అన్నాడు బ్రహ్మ.

తనను సవ్యంగా ఆహ్వానించి అతిథిమర్యాదలు చేయలేదని భృగువు, పత్నీసమేతంగా వినోదాల్లో తేలియాడుతూన్న సమయంలో పానకంలో పుడకలా వచ్చి అవరోధం కలిగించాడని బ్రహ్మ, ఒకరికొకరు పోటీ పడి కోపతాపాలను తమ ప్రమేయం లేకుండానే





తమలో పెంపొందించుకున్నారు.

సంభాషణ హీనాతి హీన స్థితికి చేరుకుంది.

ప్రాణికోటికి 'విధి' లభించే విధాతపైననే విధి విరుచుకు పడింది. 'విధిలీల విధాతకు కూడా తప్ప'దన్న నానుడి అప్పుడు బ్రహ్మ పట్ల సార్థకమైంది.

బ్రహ్మ హెచ్చరికకు భృగువు మహోగ్రంతో ఆపాద మస్తకం కంపిస్తూ 'చతుర్ముఖా!' అని భీకరంగా గర్జించాడు. నన్ను అసందర్భ ప్రలాపీ అని నిందించటవే కాకుండా గౌరవంగా వెళ్లిపొమ్మని హెచ్చరిస్తావా?... నేను వచ్చిన పని నిన్ను పరీక్షించ కుండానే అయిపోయింది! సహన శీలత లేని కోపిష్ఠి గుణం నీలో వుంది. విశ్వశాంతి యజ్ఞ హవిర్భోక్తగా నీకా అర్హత లేదని నిరూపణ అయింది. యిక- యిక్కడ నాకు జరిగిన అవమానానికి ప్రతీకారం తీర్చుకోకుండా వెళ్లను. యిప్పటికే ఒక శాపంవల్ల ఐదు ముఖాలలో ఒక ముఖాన్ని పోగొట్టు కుని, నాలుగు ముఖాలతో మిగిలిన శాపగ్రస్తా! యీనా రెండవ శాపాన్ని కూడా అనుభవించు. యిప్పటి నుంచి నీకు భూలోకంతోబాటు యేలోకంలో కూడా ఆలయం వుండదు! పూజా పునస్కారాలకు నోచుకోని నికృష్ట దైవంగా అఖిల లోక ప్రజల్లో నిల్చిపోదువు గాక" అని భయంకరంగా బ్రహ్మను శపించి అక్కణ్ణుంచి అంతర్ధానుడయ్యాడు!

సూర్యకాంతులు తనమీద పడి ఆ ప్రాంత మంతటిని కాంతిపుంజాలతో మెరిపిస్తున్న వెండి కొండమీద అప్పుడు కోలాహలం చెలరేగి వుంది.

ఓ ప్రక్క శివకన్యలు, ప్రమథగణాలు, నాట్యం చేస్తున్నారు. మరో ప్రక్కన తుంబురాదులు గానం చేస్తున్నారు. యింకో ప్రక్కన నందీశ్వరుడు, శృంగీశ్వరుడు, ఢమరుకలు లయాను బద్ధంగా మోగిస్తున్నారు. ఎంతో మంది మునులు చేతులు ముకుళించుకుని అక్కడక్కడ నిల్చున్నారు.

ఆ దినం కైలాస గిరిలో శివుడు తాండవ నృత్యం చేస్తూండటంతో, గరుడు, గంధర్వ, యక్ష, కిన్నర, కింపురుషాది దివ్యలోక వాసులు కూడా వచ్చి, నాట్య ప్రాంగణంలో భక్తి భావంతో నిల్చుని వున్నారు.

మెడలో నాగహారం తలపైకెత్తి తలవూపుతూంటే, నెన్నుదుట భస్మరాగం ధరించిన చోట మూడవ కన్ను అరవారగా మూతపడి వుండగా, గజ చర్మాంబర ధారియైన పరమేశ్వరుడు నటరాజుగా

మారి అత్యద్భుతంగా నర్తనం చేస్తున్నాడు! పార్వతీ దేవి కూడా భర్తతోపాటు ఆ మహా నృత్యంలో పాల్గొని వుంది!!

ఢమరుకలు, వాళ్ల గజ్జెలు ఒకదానికొకటి పోటీ పడి చేసే వింత శబ్దాలకు తోడు అప్పుడప్పుడు డప్పులు, తుడుం కొమ్ములు, నగారా మ్రోతలు ఆ ప్రాంతమంతటినీ శబ్దతరంగాలతో ముంచి వేస్తున్నాయి.

కాలం గడిచే కొద్దీ నాట్యం పతాక స్థాయికి చేరుకుంటున్నది. వాద్య శబ్దాలు మరింతగా ప్రతిధ్వనించటం ప్రారంభించాయి! కైలాస పర్వతం లోని అణువణువూ ఆ నాట్య గాన వాద్య ఘోషకు ప్రతిస్పందిస్తూంది!!

ఆ సమయంలో- అక్కడ ఆవిర్భవించాడు భృగువు! తధికిణతోం- ధిమిక్కి తకతక- తైతై తక తక.... అని భరతముని నాట్య విన్యాస శబ్దాలను ఉచ్చరిస్తూ తుంబురుడు పాడుతూంటే, రెప్పపాటు కాలంలో అభినయ భంగిమలను, కాళ్ల చేతుల కదలికలను మారుస్తూ, శివపార్వతులు మహో ద్వేగంతో నాట్యం చేస్తూ గోచరించారు భృగువుకు! అతని రాకను పార్వతీపరమేశ్వరులే కాదు. అక్కడి వారెవరూ పట్టించుకోలేదు!

"నమో పార్వతీ పతయే" అన్నాడు భృగువు బిగ్గరగా, అతడి మాటలు అతడి చెవులకు తప్ప యితరుల చెవుల కెంత మాత్రం వినిపించినట్లు లేదు!

ఎవరి ధోరణిలో వాళ్లు లీనమై వున్నారు!

"పరమ శివా!" గొంతులోని శక్తినంతా కేంద్రీకరిస్తూ గట్టిగా అరిచాడు భృగువు!

పరమ శివుడు గిరగిరా తిరుగుతూ నాట్య



విన్యాసంలో మునిగి వున్నాడేగాని, భృగువు పిలుపు వినిపించుకోలేదు. పార్వతి కూడా తన్మయత్వంతో నృత్యం చేస్తూనే వున్నది!

భృగువు నాలుగైదుసార్లు గట్టిగా పిలిచాడేగాని, ఆ పిలుపుకు ప్రతిస్పందన లేకపోయింది!

"ఔరా! సత్యలోకంలోని జాడ్యం కైలాసానికి కూడా అప్పుడే ఎగబ్రాకినట్లున్నది! త్రిమూర్తుల చర్యలు యీ విధమైన పామరత్వాన్ని పులుముకుంటున్నా యన్నమాట! భృగువు అంటే ఏమిటో యీ భోళా శంకరుడు కూడా చవి చూస్తాడు" అని భృగుమహర్షి పావుకోళ్లను చప్పుడు చేసుకుంటూ, గంభీర గమనంతో శివపార్వతులు నృత్యం చేస్తూన్న వేదిక దగ్గరికి నడిచాడు.

తనను చూసి కూడా చూడనట్లు నృత్యహేలలో లీనుడైన శివుని ప్రవర్తన భృగువుకు పట్టరాని ఆగ్రహాన్ని తెప్పించింది!

"శంకరా! అపు నీతైతక్కలు" అని ప్రళయ భయంకరంగా హుంకరించాడు భృగువు.

ఒంటి కాలిమీద నిలిచి, రెండవ కాలును మోకాలి మీదకు చేర్చుకోబోతోన్న ఈశ్వరుడి చెవుల్లో భృగువు హుంకారం ఝంకారంగా మ్రోగింది. మెల్లిగా రెండవ కాలిని క్రిందికి దించాడు. పార్వతి కూడా నృత్యాన్ని చాలించింది. వాద్యాలు ఎక్కడివక్కడే ఆగిపోయాయి. శివకన్యలు, ప్రమథ గణాలు తమ తమ నాట్యాన్ని చాలించారు.

"భృగూ! రాకూడని సమయంలో వచ్చి, ఏమిటీ పొలికేకలు?" అన్నాడు శివుడు కోపంతో.

"హుఁ, మాకు రాకూడని సమయమూ లేదు, చోటూ లేదు! 'అభ్యాగతి స్వయంవిష్ణుః' అని విన లేదా? విష్ణుతుల్యుడైన అభ్యాగతిని పరామర్శించక పోగా, తిరిగి విమర్శించటం నీకే చెల్లింది. ఎంత గౌరవంగా పిలిచాను, ఎన్నిసార్లు గొంతు చించుకుని అరిచాను. పిలుపైనా వినిపించుకోని యీ ఉన్మత్త వికారానికి అర్థమేమిటి?" అని గర్జించాడు భృగువు.

(ఇంకా వుంది)





# సులేఖ పెళ్ళి

అనంతగిరిని పాలించే అతీంద్రవర్మకు ఒక్కగానొక్క కూతురు సులేఖ. ఆమె అద్భుత సౌందర్యరాశి. చిన్నతనం నుంచీ అన్ని విద్యలతోపాటు సంగీతాన్ని కూడా అభ్యసించిందామె.

అతీంద్రవర్మకు కూతురంటే పంచప్రాణాలు. యుక్త వయస్కురాలు కాగానే ఆయన ఆమెకు తగిన వరుడికై అన్వేషణ ఆరంభించాడు.

ఒకరోజున సులేఖ సంగీత సాధన చేస్తూ స్పృహ తప్పిపడిపోయింది. చెలికత్తెలామెను తల్పం మీదకు చేర్చారు. రాజవైద్యులు వచ్చి శతవిధాల ప్రయత్నించినా ఆమెకు స్పృహ రాలేదు. చివరకు ఘటేంద్రుడనే వైద్య శిఖామణి వచ్చి సులేఖను

(కరాళ కథలు)



పరీక్షించి ఆమెకు మెదడు నరాలకు సంబంధించిన అరుదైన జబ్బు వచ్చిందనీ, దానికి మందు లేదనీ చెప్పి వెళ్ళిపోయాడు.

అప్పట్నించీ కూతురు పరిస్థితినే తల్చుకుంటూ దిగులుతో కృశించిపోసాగాడు అతీంద్రవర్మ. అలాంటి పరిస్థితుల్లో సత్యేంద్రుడనే ముని రాజును చూడవచ్చాడు. ఆయన రాజును ఓదార్చి, "నీ కుమార్తె కారణజన్మురాలు. ఆమె వ్యాధి విధి నిర్ణయం. ఒక శాపగ్రస్థుడి జీవితగమ్యాన్నామె వ్యాధి నిర్ణయించనున్నది" అన్నాడు.

"స్వామీ! మీ మాటలు నాకు అర్థం కాలేదు. నా కుమార్తె మామూలు మనిషి అవుతుందో లేదో చెప్పండి" అన్నాడు అతీంద్రవర్మ.

సత్యేంద్రుడు లిప్తకాలం మౌనం వహించి, కళ్ళు మూసుకుని తెరిచాడు. గొంతు సవరించుకుని, "నీ రాజ్యానికి పడమర దిక్కుగా శివ, స్వర, నగధ, చక్రధర రాజ్యాలకు అవల భయంకరమైన నీలేష్ఠి కారణ్యం ఉంది. ఆ అడవిలో ఒకచోట భూగర్భంలో నివాసం ఏర్పరచుకున్న బ్రహ్మరాక్షసుడున్నాడు. వాడి మెడలో జీవేష్ఠి అనబడే మహిమాన్వితమైన ఫలముంది. అది ఎంతకాలమైనా ఎండిపోక రసం చిప్పిలుతూ ఉంటుంది. ఆ ఫలరసం సేవిస్తే రాకుమారి స్వస్థురాలవుతుంది-" అని చెప్పి ఆయన వెళ్ళిపోయాడు.

జీవేష్ఠి ఫలాన్ని తెచ్చిన వారికి రాకుమారినిచ్చి వివాహం చేస్తానని అతీంద్రవర్మ దేశదేశాలా చాటింపు వేయించాడు.

అనంతగిరికి పొరుగున ఉన్న విజయగిరి రాజు విష్ణువర్మకు విజయుడనే కొడుకున్నాడు. అతడు మహేంద్రుడు, అనంతుడు అనే ఇద్దరు మిత్రులతో ఇటీవలే గురుకులంలో చదువు ముగించుకుని వచ్చాడు. విద్యాభ్యాసం పూర్తి కాగానే గురువు ముగ్గురికీ మూడు ప్రత్యేకమైన విద్యలు నేర్పాడు. ఆ ప్రకారం విజయుడు సృష్టిలోని సామాన్య ప్రాణులన్నింటినీ లొంగ దీసుకోగల వశీకరణ విద్యను నేర్చుకున్నాడు. మహేంద్రుడు భూగర్భంలోని విశేషాలను దర్శించగలడు. అనంతుడు విద్వాంసులను మెప్పించే విధంగా గానం చేయగలడు.

సులేఖ అనారోగ్యము, జీవేష్ఠి ఫలమూ గురించిన చాటింపు విని ముగ్గురు మిత్రులూ ఉత్తమాశ్వాల నధిరోహించి నీలేష్ఠి కారణ్యానికి బయల్దేరారు. శివ,

స్వర, నగధ, చక్రధర రాజ్యాలను దాటి నీలేష్టి కారణ్యం సమీపించగానే వారికి సింహగర్జనలూ, పెద్దపులి గాండ్రింపులూ, కాలనాగుల బుసలూ వినిపించాయి. కొన్ని క్రూరమృగాలు, సర్పాలు అడవి చుట్టూ పహరా తిరుగుతున్నాయి.

విజయుడు వెంటనే వశీకరణ మంత్రాన్ని చదువుతూ అడవిలో ప్రవేశించాడు. మరుక్షణం క్రూరజంతువులన్నీ అతడికి పెంపుడు జంతువులయ్యాయి. మిత్రులిద్దరూ [illegible]ననుసరించారు. ఆ తర్వాత వారికి ఆ అడవిలో భయపడాల్సిన అవసరం లేకపోయింది.

అలా కొంతదూరం వెళ్ళేక మహేంద్రుడు ఒకచోట ఆగి, "అదిగో, ఆ కనబడుతున్న బండరాతిని తొలగిస్తే భూగర్భంలోకీ మెట్లుంటాయి. అవి రాక్షసుడి భవనానికి దారి తీస్తాయి." అని చెప్పాడు.

మహేంద్రుడు చెప్పిన విధంగానే మిత్రులు ముగ్గురూ రాక్షసుడి భవంతిలోకి ప్రవేశించారు.

లోపల ఒకచోట రాక్షసుడు కూర్చుని ఉన్నాడు. పర్వతాకారంలో ఉన్న వాడి మెడలో ఓ తీగ సాయంతో వ్రేలాడుతున్న జీవేష్టిఫలం బంగారు రంగులో మెరిసిపోతోంది.

రాక్షసుడు ము[illegible]గ్గురు మిత్రుల్నీ చూస్తూనే లేచి నిలబడ్డాడు. పెద్దపెట్టున బొబ్బలు పెడుతూ వారివైపు రాసాగాడు.

వాడినెదుర్కొనడమంటే పొట్టేలు కొండను ఢీకొన్నట్లేనని ముగ్గురు మిత్రులకూ అర్థమయింది. అప్పుడు అనంతుడు వేరు దారితోచక రాళ్ళను సైతం కరిగించగల తన గళం విప్పి పాట మొదలు పెట్టాడు.





ఆశ్చర్యంగా రాక్షసుడు ఉన్న పళంగా కూలబడి నాగస్వరం వింటున్న విష సర్పంలా తల ఊపసాగాడు. అనంతుడు పాట ఆపగానే వాడు అపరిమితానందంతో, "ఎంతో కాలానికి అద్భుత సంగీతం విన్నాను. మీరెవరో, ఇక్కడికెలాగొచ్చారో నాకు తెలియకుండా ఉంది కానీ నన్నింతగా సంతోష పెట్టినందుకు మీరే మడిగినాయిస్తాను" అన్నాడు.

మిత్రులు వాడిని జీవేష్ఠి ఫలం ఇమ్మన్నారు. రాక్షసుడు కిమ్మన కుండా వారికా ఫలాన్ని అందజేసి వెంటనే నిర్జీవంగా నేలకూలాడు. అప్పుడు వాడిలోంచీ ఒక మనిషి వచ్చి తన పేరు కల్హణుడని చెప్పి తన కథను వివరించాడు.

కల్హణుడు, రత్నాకరుడు సత్యేంద్రుడనే మునికి శిష్యులు. ఆయన వారిని గొప్ప సంగీత విద్వాంసులుగా తీర్చిదిద్దేక ఇద్దరికీ చెరో అద్భుత శక్తినీ ప్రసాదించాడు.

ఆయన కల్హణుడికో భరిణనిచ్చాడు. తలచుకున్నప్పుడల్లా అందులోకి మూడు గుళికలు వస్తాయి. వాటిని రోజుకొకటి చొప్పున సేవిస్తే మూగవారికి మాట వస్తుంది. పొరపాటున ఒకేసారి మూడు గుళికలూ సేవిస్తే ఉన్నమాట కర్ణకఠోరంగా తయారవుతుంది. అదే విధంగా గురువు రత్నాకరుడికి దుష్టులను శిక్షించడానికి శపించేశక్తినిచ్చాడు.

"మీ విద్యలను మీరు లోకకళ్యాణానికి మాత్రమే ఉపయోగించాలి సుమా!" అని సత్యేంద్రుడు శిష్యులను మరీ మరీ హెచ్చరించి వీడ్కోలు చెప్పాడు.

గురుకులం విడిచి పెట్టేక కల్హణుడు, రత్నాకరుడు ఆ దేశపు రాజధానికి బయలుదేరారు. అక్కడ రాజాస్థానంలో ఆస్థాన సంగీత విద్వాంసుడి నియామకం జరుగనున్నది.

అప్పుడు కల్హణుడిలో దురాలోచన పుట్టింది. రత్నాకరుడు సంగీతవిద్యలో అన్నివిధాలా తనతో సమానుడు. జయాపజయాలు దైవాధీనాలు కాబట్టి అదృష్టం ఎవరిని వరిస్తుందో చెప్పలేము కదా! ఉన్నదేమో ఒక్కటే పదవి అందుకని వాడు తన భరిణలోని మూడు గుళికలనూ మంచి నీటిలో కలిపి తెలియకుండా ఆ నీటిని రత్నాకరుడి చేత తాగించాడు. వెంటనే రత్నాకరుడి గొంతు కర్ణకఠోరంగా మారిపోయింది.

జరిగిందేమిటో రత్నాకరుడు గ్రహించాడు. వాడు

కోపంగా, "మూర్ఖుడా! లోక కళ్యాణానికుపయో గించాల్సిన శక్తిని స్వార్థానికుపయోగిస్తావా? ఇందుకు ప్రతిఫలం అనుభవించకతప్పదు. నువ్వు బ్రహ్మరాక్షసుడివైపోతావు!" అంటూ కర్ణ కఠోరమైన గొంతుతో శపించాడు. అంతేకాదు, "నాగానం, స్వరం, ప్రతిభ వెలుగు చూడకుండా చేసిన దుష్టుడివి. కాబట్టి నీవు సూర్యుని వెలుగును చూసిన వెంటనే నీ మెదడులోని నరాలు నిర్జీవమై క్రమంగా ప్రాణాలు కోల్పోతావు. అందుకని బ్రతుకు మీద ఆశ ఉంటే ఇక చీకటినే ఆశ్రయించు" అనేసి అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.



అప్పటికే కల్హణుడు బ్రహ్మ రాక్షసుడిగా మారి పోయాడు. వాడి మెదడులోని నరాలు శాప ప్రభావంతో నిర్జీవం కాసాగాయి. అప్పుడు వాడు సర్వశక్తులూ క్రోడీకరించి గురువు సత్యేంద్రుణ్ణి ప్రార్థించాడు.

సత్యేంద్రుడు వాడి ముందు ప్రత్యక్షమైనాడు. వాడి ప్రాణాలు రక్షించడానికి జీవేష్ఠి అనే ఫలాన్ని సృష్టించి మెడలో వేశాడు. తర్వాత భూగర్భంలో ఓ భవనాన్ని సృష్టించి వాడిని అందులోకి పంపి, "దురాశ, అసూయలతో నీవు చేసిన తప్పుకు ఈ శిక్ష తప్పదు. ఈ ఫలం నీ మెడలో ఉన్నంతకాలం ఆకలిదప్పులు నిన్ను బాధించవు. నీ ప్రాణాలకు ముప్పులేదు. నిన్ను పలుకరించేవారు లేక, నీకు సంగీతం వినిపించేవారు లేక, వెలుగు కంట పడక దుర్భర భూగర్భ కారాగారవాసం నీకు తగిన శిక్ష. అయితే ఈ జీవేష్ఠి ఫలాన్ని మరొకరి ప్రాణాలు నిలబెట్టడానికి ఉపయోగ పడేందుకు గాను నువ్విచ్చిన రోజున నీకు శాప విముక్తి లభిస్తుంది." అని చెప్పి వెళ్ళిపోయాడు.

వాడి శాపవిమోచనానికా అన్నట్లు సులేఖకు ఏంత వ్యాధి వచ్చింది. ఇప్పుడు కల్హణుడికి శాపవిమోచనమయింది.

"నాలో ఇప్పుడు అన్యాయాద్వేషాలు నశించాయి. స్వార్థకాంక్ష తొలగిపోయింది. ప్రజాసేవకే నా జీవితాన్నంకితం చేస్తాను." అంటూ కల్హణుడు వారితోపాటు భూగర్భంలోంచి బయటకు వచ్చి ఆ తర్వాత తన దారిన తాను వెళ్ళాడు.

ముగ్గురు మిత్రులూ అనంతగిరి రాజ్యం చేరుకున్న సమయానికి అక్కడి పరిస్థితి అల్ల కల్లోలంగా ఉంది. వైదేహిరాజు తన సైన్యంతో



మందిరంలోకి వెళ్ళారు.

వైద్యులు జీవేష్ఠి ఫలరసాన్ని సులేఖచేత తాగించారు. ఆమె అంతసేపూ నిద్రపోతున్న దానిలా చప్పున లేచి కూర్చుంది.

కుమార్తె స్వస్థురాలైందని తెలియగానే అతీంద్ర వర్మ అనారోగ్యం కూడా చేత్తో తీసినట్లు మాయ మయింది. ఆయన వెంటనే మంత్రులను పిలిచి జరుగుతున్నదంతా అడిగి తెలుసుకుని, "నా కుమార్తెను జీవేష్ఠి ఫలం తెచ్చినవారికిచ్చి పెళ్లి చేస్తానని చాటింపు వేయించాను. అనంతగిరి రాజులు ఆడిన మాట తప్పరు. కాబట్టి సంధి ప్రయత్నాలు ఆపండి. యుద్ధానికి సన్నద్ధులుకండి. విదేహ రాజుకు నా కుమార్తె నిచ్చి పెళ్ళి చెయ్యడం కలలోని మాట!" అన్నాడు.

అందుకు మంత్రులు, "ప్రభూ! జీవేష్ఠి ఫలాన్ని ముగ్గురు యువకులు కలిసి సాధించారు. వారిలో ఎవరిని రాకుమారి వివాహ మాడాలో నిర్ణయించడం అసాధ్యం. అదీకాక ఇప్పుడు దేశం ప్రమాదంలో ఉంది. దేశ క్షేమం దృష్ట్యా రాకుమార్తెను విదేహి రాజుకిచ్చి వివాహం చేసి జీవేష్ఠి ఫలం తెచ్చిన ముగ్గురు యువకులనూ తగిన రీతిని సత్కరించడం సబబని మాకు తోస్తున్నది" అన్నారు.

అతీంద్రవర్మ దీర్ఘాలోచనలోపడి, "దేశ క్షేమం నా సమస్య. వివాహం సులేఖ సమస్య. దీనిని ఆమెనే పరిష్కరించుకోమనడం సబబు" అన్నాడు చివరికి.

అనంతగిరి కోటని చుట్టుముట్టారు. కూతురి అస్వస్థతతో దిగులు చెందిన అతీంద్రవర్మ యుద్ధ సన్నాహాలు చేయగల స్థితిలో లేడు. ఇంచుమించుగా ఆయన కూడా మంచం పట్టి అవసాన దశలో ఉన్నాడనే చెప్పాలి.

మంత్రులు సంధి ప్రయత్నాల కోసం మంతనాలు జరుపుతున్నారు. అయితే వృద్ధుడైన విదేహరాజు అవసానదశలో ఉన్నా సరే సులేఖను పెళ్ళాడతానని పట్టుబట్టాడు. అందుకని అందరూ దీర్ఘాలోచనలో పడిపోయారు.

ఆ సమయంలో విజయుడు కోట చుట్టూ ఉన్న సైన్యాన్ని వశీకరణ విద్యతో లోబర్చుకుని మిత్రులతో సహా లోపల ప్రవేశించాడు. వారు ముగ్గురూ జీవేష్ఠి ఫలాన్ని తీసుకుని అంతఃపుర

సులేఖ తన ప్రాణదాతలైన ఆ ముగ్గురు యువకులనూ సమ్ముఖానికి పిలిపించుకుని వివాహం విషయంలో వారి అభిప్రాయాల నడిగింది. తమలో ఏ ఒక్కరిని వివాహం చేసుకున్నా ఆమె నిర్ణయాన్ని గౌరవిస్తామని ముగ్గురు మిత్రులూ చెప్పాక- ఆమె విజయుణ్ణి వివాహం చేసుకుంది.

కరాళుడింత వరకే కథను చెప్పి, "విజయుడి కంటె మహేంద్ర, అనంతులకున్న శక్తులు గొప్పవి. కానీ విజయుడు రాకుమారుడు కదా అని యువరాణి జాతి పక్షపాతం చూపింది. అంతేకాదు, విదేహరాజును కాదని ఆమె రాజ్యానికే ప్రమాదం తెచ్చిపెట్టింది. అటువంటి స్వార్థపరురాలి కోసం ప్రాణాలకు తెగించి జీవేష్టి ఫలాన్ని సాధించుకుని వచ్చిన ముగ్గురు మిత్రులూ ముగ్గురు మూర్ఖులని నాకు తోస్తున్నది. కల్వ ణుడి శాపవిమోచనానికి ఆ స్వార్థపరురాలినీ, మూర్ఖులనూ నిర్దేశించిన సత్యేంద్రముని ఆశయం ఆ సందర్భంగా నాకు తోస్తున్నది. ఇదంతా ఇలా ఎందుకు జరిగిందో నాకు అర్థం కాకుండా ఉన్నది. తెలిసి కూడా నాకు వివరించకపోయావో ఓ సవిత్యుక మహారాజా! ఈ క్షణం నుంచీ నీవు నాకు బానిసవు" అన్నాడు.

దీనికి సవిత్యుకుడు, "సులేఖ దేశక్షేమాన్ని కోరే విజయుణ్ణి పెళ్ళి చేసుకుంది. రాక్షసుల్నీ, రాక్షస గృహాల్నీ కనుక్కోగల అపూర్వశక్తుల కంటె సామాన్య ప్రాణుల్ని వశపర్చుకోగల విజయుడి శక్తివల్లే దేశానికి ప్రయోజనం. కోట చుట్టూ ఉన్న సైన్యాన్ని వశపర్చుకుని కోటలో ప్రవేశించగల విజయుడు రాజైతే దేశానికి శత్రుభయముండదు కదా! అందుకే అన్ని విధాలా సులేఖ చేసిందే సబబు" అన్నాడు.

అది సరియైన సమాధానం కావడంతో సవిత్యుకుడి కెదురుగా ఉన్న కన్యపై కరాళుడి ప్రభావం నశించి ఆ యువతి జింకగా మారి అడవిలోనికి పరుగు తీసింది.

-డి.కె.చదువుల బాబు





# విప్లవం - చైతన్యం

అమృతపురి రాజు ధర్మవీరుడు పేరుకి తగినట్లు ధర్మ ప్రభువు. గొప్ప వీరుడు. అతని మంత్రి సుధర్ముడు మహామేధావి. రాజనీతి చతురుడు. వారిద్దరి కలయికలో అమృతపురి సుసంపన్నమై, సాటి రాజ్యాలలో అగ్రగామిగా నిలిచింది.

ధర్మవీరుడికి ఒక్కడే కొడుకు. కొడుకు భవిష్యత్ ఉజ్వలంగా ఉండి మంచి వీరుడిగా పేరు తెచ్చుకోవాలన్న ఆకాంక్షతో ధర్మవీరుడు, కుమారుడికి మహావీరుడు అని నామకరణం జరిపాడు.

అయితే మహావీరుడి నడవడిక మహారాజు ఆశించినట్లు ఉండేది కాదు. అతనిది చిన్నప్పటి నుంచి దుడుకు స్వభావం. పెద్దలపట్ల గౌరవం చూపేవాడు కాదు. పేదలపట్ల అనహ్యం చూపేవాడు. గురువులతో నిర్లక్ష్యంగా వ్యవహరించేవాడు.

కొడుకు ప్రవర్తనకు ధర్మవీరుడు చింతిల్లాడు. అయితే నెమ్మదిగా మారుతాడని, పెద్దవాడయ్యేసరికి యోగ్యుడవుతాడని సరిపెట్టుకున్నాడు. కానీ సంవత్సరాలు గడిచి మహావీరుడు పెద్దవాడయ్యాడే గాని అతనిలో మహారాజు ఆశించిన మార్పు మాత్రం రాలేదు.

కొడుకులో ఆశించిన మార్పు రాకపోయేసరికి ధర్మవీరుడు కృంగిపోయాడు. మంత్రి సుధర్ముడు ఎన్నో విధాలుగా మహారాజుకు ధైర్యం చెప్పేవాడు.

ధర్మవీరుడికి వృద్ధాప్యం మీదపడి ఆరోగ్యం క్షీణించింది. మహామంత్రి సలహామేరకు ధర్మవీరుడు, కుమారుడికి పట్టాభిషేకం జరిపించ సంకల్పించాడు. అది తెలిసి మహావీరుడు ఎంతగానో సంతోషించాడు. సింహాసనం అధిష్ఠించగానే సమస్తమైన భోగాలు అనుభవించ వచ్చునని తలపోసాడు.

ఒక శుభముహూర్తాన ధర్మవీరుడు, కుమారుడికి పట్టాభిషేకం జరిపించాడు. మహావీరుడు సింహాసనం అధిష్ఠించిన క్షణాన "నాయనా! ఇంతకాలం నేను మంత్రి సుధర్ముడి సలహా మేరకు పరిపాలన గావించి రాజ్యాన్ని సుభిక్షం జేసాను. మన మంత్రి

ఎన్.శివనాగేశ్వరరావు

ధార్మికుడు, రాజనీతిజ్ఞుడు. అతని సలహా మేరకు పరిపాలన గావించి మంచి ప్రభువుగా కీర్తి గడించు" అని ధర్మవీరుడు హితవు చెప్పాడు.

మహావీరుడికి సుధర్ముడి మీద సదభిప్రాయం లేదు. అతనికి అప్పటికే మంత్రిని మార్చి వేసి కొత్తవారిని ఎంపిక జేయాలన్న యోచన ఉంది. అప్పటికి తండ్రి మాట కాదనలేక అయిష్టంగానే తన సమ్మతి" తెలియబరిచాడు.

కొద్దిరోజులకే ధర్మవీరుడు కన్నుమూసాడు. తండ్రి మరణంతో మహావీరుడు తనకు స్వేచ్ఛ లభించినట్లు భావించాడు.

మహావీరుడు మద్యం సేవిస్తూ, జూదం ఆడుతూ, విందు వినోదాలతో కాలక్షేపం చేయసాగాడు. రాజ్య పాలన పూర్తిగా విస్మరించాడు. అది గమనించిన సుధర్ముడు, మహావీరుడ్ని సుతిమెత్తగా మందలించి ధర్మం బోధించాడు. అందుకు మహావీరుడు మండిపడి "మంత్రీ! నేనడిగినప్పుడే సలహా ఇవ్వండి. అనవసర విషయాల్లో మీ జోక్యం నేను సహించను" అన్నాడు. సుధర్ముడు మౌనం వహించాడు.

మహావీరుడి భోగలాలసత గురించి అందరికీ తెలిసిపోయింది. దానితో భజనపరులు అవినీతి పరులు మహారాజుకు చేరువై అతని అభిమానం పొందారు.

మహావీరుడు నృత్య గానవిలాసాలతో జీవితం ఆనందంగా గడపసాగాడు. క్రమేపీ అతను మద్యపానానికి, జూదానికి బానిస అయ్యాడు. అతని జూద ప్రియత్వం తెలిసిన సాటిరాజులు కాలక్షేపానికి మహావీరుడి వద్దకు వచ్చి జూదం ఆడసాగారు.





మహావీరుడు పెద్ద మొత్తాల్లో పందాలు ఒడ్డి ఒడిపోయేవాడు.

దానితో ఖజానాలోని సొమ్ము ఖాళీ అయిపోయింది. ఖజానా నింపడానికి మహావీరుడు ప్రజల మీద పన్నుల భారం పెంచాడు. పన్నులు కట్టలేక ప్రజలు విలవిల్లాడారు. మహావీరుడు దయా దాక్షిణ్యాలు మరచిపోయి పన్ను కట్టలేని వారిని చెట్లకు కట్టి కొరడాలతో కొట్టమని, ఇళ్ళు తగల బెట్టమని సైనికులకు ఆజ్ఞలు జారీ చేసాడు.

సుధర్ముడు మహావీరుడ్ని వారించే ప్రయత్నం జేసాడు గాని అతను లక్ష్య పెట్టలేదు. మహామంత్రిని మార్చడానికి పథకం వేసాడు గాని అందుకు రాజమాత ప్రతిఘటించింది.

త్వరలోనే మహావీరుడికి 'రాక్షసరాజు' అన్న పేరు వచ్చింది. తండ్రి ధర్మవీరుడు ప్రజలలో సంపాదించు కున్న మంచి పేరును అతను తన దుష్ట చేష్టలతో చెరిపేసాడు. క్రమేపీ ప్రజలు ఇటువంటి దుష్టుడ్ని కన్నందుకు ధర్మవీరుడిని కూడా నిందించసాగారు. అది విని సుధర్ముడు చలించి పోయాడు. రాజ్య భవిష్యత్తు గురించి రాజమాతతో చర్చలు జరిపాడు. రాజ్యంలో ప్రబలిన లంచగొండితనం గురించి, బందిపోట్ల గురించి ఆమెకు వివరించాడు.

అంతలో రాజ్యంలో ఒక అనూహ్య సంఘటన జరిగింది. మహావీరుడి దుష్ట పాలనలో విసిగెత్తి పోయి, విజయక్రాంతుడు అనే యువకుడు ప్రజావిప్లవానికి నడుం బిగించాడు. అతను మహారాజుకు వ్యతిరేకంగా ప్రజలను సంఘటిత పరచ ప్రయత్నించాడు. మహావీరుడి దుష్టత్వాన్ని భరించలేని ప్రజలు కొందరు అతనికి బాసటగా నిలిచారు. ప్రజలలో ఎక్కడ విన్నా విజయక్రాంతుడి పేరు మారుమోగి పోసాగింది.

విజయక్రాంతుడు రాజ్యంలోని యువకులు కొందరికి వీరవిద్యలలో శిక్షణ ఇచ్చి బంది పోట్లను ఎదిరించాడు. అవినీతి పరులైన రాజోద్యోగులకు ప్రతిబంధకంగా మారాడు.

మహావీరుడికి నెమ్మదిగా విజయక్రాంతుడి గురించి తెలిసింది. అతను కోపోద్రిక్తుడై విజయక్రాంతుడ్ని పట్టించిన వారికి లక్షవరహాలు బహుమతిగా ప్రకటించాడు. అయితే విజయక్రాంతుడు ఎక్కడ ఉండి ఉద్యమం నడిపిస్తున్నాడో గూఢచారులు తెలుసుకోలేక పోయారు.

ఒకనాడు చారుశీలుడు అనే గుఢచారి, సుధర్ముడ్ని కలసి "మహామంత్రి! అతి ప్రయసతో విజయ క్రాంతుడి ఉనికి తెలుసుకున్నాను. అతనికి ప్రజలలో మంచి పేరుంది. నిజానికి అతను చేస్తున్నవన్నీ మంచి పనులే! మన మహారాజు దుష్ట పాలన మనకు తెలిసిందే! విజయక్రాంతుడ్ని బంధించాలా? వద్దా? అనే మీ మాంసలోపడి మీ సలహా కోసం వచ్చాను" అన్నాడు.

సుధర్ముడు, విజయక్రాంతుడు ఎక్కడ ఉంటాడో చారుశీలుడి ద్వారా తెలుసుకుని "ఏం జేయాలో నేను ఆలోచిస్తాను. నీవు వెళ్ళు" అని పంపించి వేసాడు.

సుధర్ముడు, మహావీరుడ్ని కలసి "రాజా! విజయ క్రాంతుడు ఎక్కడ ఉండేదీ తెలిసింది. వెరికళ్లాంటి సైనికులను పంపి అతని బంధించండి" అని విజయక్రాంతుడు ఉండే ప్రదేశం గురించి చెప్పాడు.

మహావీరుడు, వెను వెంటనే విజయక్రాంతుడ్ని బంధించే ఏర్పాటుచేసాడు. అతను బందీ అవక తప్పలేదు.

మహావీరుడు సభతీర్చి "మంత్రిగారూ! విజయ క్రాంతుడి ఉనికి తెలియబరిచిన మీరే అతనికి తగిన శిక్ష విధించండి" అన్నాడు.

అందుకు సుధర్ముడు "మహారాజా! మరెవ్వరూ విప్లవకారుడిగా మారకుండా ఉండడానికి, ప్రజా ఉద్యమం నిర్వీర్యం అవడానికి విజయక్రాంతుడ్ని బహిరంగంగా ఉరితీయించండి" అన్నాడు.

మహావీరుడు, సుధర్ముడి వంక ప్రశంసగా చూసి "ఇంత కాలానికి మీరో మంచి సలహా ఇచ్చారు" అని విజయక్రాంతుడ్ని బహిరంగంగా ఉరి తీయడానికి



ఆదేశాలు జారీ చేసాడు.

ఆ క్షణం విజయక్రాంతుడు, సుధర్ముడి చెంతకు వెళ్ళి "మహామంత్రీ! మీ గురించి నాకు తెలుసు. మీరు మహారాజుకు ఇచ్చిన సలహాకు నా కృతజ్ఞతలు. ఈ రాజ్యవాసులు మీకెప్పటికీ ఋణపడి ఉంటారు" అని నమస్కరించాడు.

విజయక్రాంతుడు ఉరితీయబడ్డాడు.

రాజమాత, సుధర్ముడ్ని పిలిపించి "మహామంత్రీ! విజయక్రాంతుడు చేసినవన్నీ మంచిపనులే! అతన్ని ఉరితీయడం అధర్మంకాదా? మీరు మహావీరుడికి ఎందుకటువంటి సలహా ఇచ్చారు?' అని ప్రశ్నించింది.

అందుకు సుధర్ముడు "మహారాణీ! రాజు కంటే రాజ్యం ముఖ్యం అని ధర్మవీరు ప్రభువులు అంటూ ఉండేవారు. రాజ్యం నిలవడానికే అటువంటి సలహా ఇచ్చాను. ప్రజా విప్లవానికి, విజయక్రాంతుడు ఆశించినంత చైతన్యం ప్రజల్లో రాలేదు. అతన్ని ఉరితీయించడంతో ఆ చైతన్యం ప్రజల్లో వస్తుంది. ఆ ధాటికి మహావీరుడు అడవులు పట్టక తప్పదు. అది ఊహించే విజయక్రాంతుడు నాకు ధన్యవాదాలు చెప్పాడు" అని చెప్పాడు.

విజయక్రాంతుడి ఉరితీతతో ప్రజలు ఆగ్రహోదగ్రులయ్యారు. ప్రజా విప్లవం ఉప్పెనలా పొంగింది. ఆయుధాలు ధరించి తిరగబడ్డ ప్రజలను చూసి సైనికులు భయంతో పరుగులు తీసారు. ప్రమాదం గమనించిన మహావీరుడు రహస్యమార్గాన తప్పించుకు పారిపోయాడు.

ప్రజలు, విజయక్రాంతుడి సోదరుడికి సింహాసనం అప్పగించారు. అతను మహామంత్రి సుధర్ముడి సలహాలతో త్వరలోనే రాజ్యంలో ధర్మస్థాపన గావించాడు.

అయితే విప్లవ కారులవల్లకాక వారి మరణంతోనే చైతన్యం పొందే స్థాయిని ప్రజలిప్పటికీ అధిగమించక పోవడంవల్ల- ఇప్పటికీ వారికి విప్లవం అవసరం కనపడుతూనే ఉంది.





# జ్ఞాన దరిద్రుడు

వీరభద్రుడికి కూర్చుని తిన్నా తరతరాలు తరగని ఆస్తి ఉంది. దాంతోపాటు ఉపకార గుణం కూడా ఉంది. ఆయన ఎవరికైనా అవసరపడితే చిన్న మొత్తాలు దానంగానూ, పెద్ద మొత్తాలు వడ్డీలేని అప్పుగానూ ఇచ్చి ఆదుకుంటూండేవాడు.

వీరభద్రుడి దానగుణం గురించి పాపన్నకు తెలిసింది. అతడి కూతురు పెళ్ళికి రెండువేల రూపాయలు అవసరపడ్డాయి.

పాపన్న వీరభద్రుడివద్దకు వెళ్ళాడు. ఆ సమయానికి వీరభద్రుడు రాంబాబుతో కబుర్లాడుతూ, "కౌరవులు పాండవులకు అర్థరాజ్యం ఇవ్వాల్సిన పనిలేదు. ఎందుకంటే హస్తినాపురి రాజు ధృతరాష్ట్రుడు. తన కొడుకులకే పూర్తి రాజ్యన్నిచ్చుకుంటాడు ధృతరాష్ట్రుడు. తమ్ముడి కొడుకులకు సగమెందుకివ్వాలి?" అన్నాడు.

రాంబాబు వెంటనే, "ఎంత బాగా సెలవిచ్చారు? మీ మాటలు అక్షర సత్యాలు" అన్నాడు.

"ఏ విషయాన్నైనా వెంటనే అలా ఒప్పుకోకూడదు. ఆలోచించి చెప్పాలి. అలాగైతేనే నా కిష్టం!" అన్నాడు వీరభద్రుడు రాంబాబును మందలిస్తూ.

"అంతా తమరు అరటి పండు వలిచినట్లు చెప్పేసేక ఇంకా నేను ఆలోచించేదాఏమైనా ఉందా బాబూ?" అన్నాడు రాంబాబు.

ఈ మాటలు విన్న పాపన్న, "అయితే కృష్ణుడు రాయబారానికెందుకు వెళ్ళినట్లు రాంబాబూ! అయ్యగారు ఆలోచించమన్నందుకైనా కొంత ఆలోచించాలని తట్టలేదా నీకు? ధృతరాష్ట్రుడు రాజు కాదు. రాజ ప్రతినిధి. పాండురాజే రాజు. తమ తండ్రి రాజ్యంలో అర్ధ రాజ్యం వాటా అడగడం పాండవుల మంచితనం. కాదంటావా?" అన్నాడు తనూ సంభాషణలో కలగజేసుకుని.

"ఏమో, నాకు అయ్యగారి మాటే నిజంలా తోస్తోంది. కృష్ణుడు తనకు తోచినవి చేసి అవే మంచి పనులనుకొమ్మన్నాడు. అయ్యాగారలా కాదు. చెడ్డ వాళ్ళలో కూడా మంచి ఉంటే ఒప్పుకుందుకు సందేహించరు" అన్నాడు రాంబాబు.

పూకాటి శ్రీనివాసులు

వీరభద్రుడు ఆప్యాయంగా రాంబాబు వంక చూసి, "నీ కొడుకు చదువుకు వందరూపాయలు కావాలన్నావు కదూ- ఈ రోజుల్లో వందేంచాలుతుందీ- ఇంద, ఈ రెండొందలూ ఉంచు" అంటూ డబ్బిచ్చి పంపేశాడు.

అప్పుడు పాపన్న నసుగుతూ తన అవసరం గురించి చెప్పాడు.

"నీకేమయ్యా- నీవు అర్థానికి పేదవాడివేమో కానీ జ్ఞానానికి పేదవాడివి కాదుగా! నీ జ్ఞానం నీకు సాయపడకపోదులే- వెళ్ళు, వెళ్ళు!" అన్నాడు వీరభద్రుడు నిరసనగా.

అప్పటికి పాపన్నకు అసలు విషయం అర్థమయింది. రాంబాబుకున్న పాటి తెలివి తనకు లేకపోయిందే అని మనసులో బాధపడి, "అయ్యా! నేను అర్థానికి దరిద్రుడినన్న విషయం చూడగానే తెలుస్తుంది. జ్ఞానానికి కూడా దరిద్రుడినన్న విషయం మీరింకా తెలుసుకోలేదంటే నమ్మలేకపోతున్నాను" అన్నాడు.

"నువ్వు జ్ఞానానికి దరిద్రుడివా - నేను నమ్మను" అన్నాడు వీరభద్రుడు.

"అయ్యా! జ్ఞానంలో నిధి మీరేనని ఈ ఊరందరికీ తెలుసు. జ్ఞానంలో దరిద్రుడైన వాడు మాత్రమే మీ మాట కాదంటాడు. నేను జ్ఞాన దరిద్రుడినని నిరూపించుకోవడం కోసమే మీ మాట కాదన్నాను. అయినా మీరు నాకు నా జ్ఞానం సాయపడుతుందంటున్నారంటే ఈ రోజు దురదృష్టదేవత నన్నావహించి ఉందనుకోవాలి" అన్నాడు పాపన్న వినయంగా.

వీరభద్రుడు నవ్వి, "ఏదో సరదాకన్నాను లేవయ్యా, నీ కూతురి పెళ్ళి నా కూతురి పెళ్ళి కాదూ! ఓ అయిదు వేలిస్తాను. దగ్గరుంచుకుని ఖర్చులయ్యాక మిగిలింది నాకిచ్చేసేయ్." అన్నాడు ఆప్యాయంగా.

గొప్పవాళ్ళ దగ్గర జ్ఞాన దరిద్రుడినని ఒప్పుకోవాలన్న జ్ఞానం అప్పటికైనా తనకు కలిగినందుకు సంతోషిస్తూ డబ్బు తీసుకుని వెళ్ళాడు పాపన్న.



# బొమ్మరిల్లు ముచ్చట్లు

## నిదురపోరా తమ్ముడా!

మనిషి ఆరోగ్యానికి పొగాకు హాని చేస్తుంది. ఎవరూ ఆ అలవాటును విడిచిపెట్టరు. మద్యం కూడా ఆరోగ్యాన్ని దెబ్బ తీస్తుంది. అయినా



ఎందరో ఆ అలవాటుకు బానిస అవుతున్నారు.

మనిషి ఆరోగ్యానికి నిద్ర కూడా మంచిది. ఇది పాటించడం సులభమే కదా- అయినా నిద్రపోవడం ఏదో తప్పన్నట్లు మాట్లాడతారు. ఇందిరాగాంధీ, చంద్రబాబు వగైరాలు రోజుకు 20 గంటలు పనిచేయడాన్ని ఆదర్శంగా చెబుతారు. కానీ అది ఏ మాత్రం మంచిది కాదు.

రోజుకు ఎనిమిది గంటల నిద్ర మనిషి ఆరోగ్యానికి ఎంతైనా అవసరం. ఆ నిద్ర ఆరున్నర గంటలకు తగ్గిందా- ప్రమాదం కూడా! ఎందుకంటే నిద్రలో జీర్ణక్రియ తక్కువ వేగంతో జరుగుతుంది. శక్తి పొదుపు అవుతుంది. మాంసకృత్తులు నిల్వ చేయబడతాయి. శరీరం పెరుగుదలకుపయోగపడే హార్మోనుల ఉత్పత్తి జరుగుతుంది. అంటే సరిగ్గా నిద్రలేని పిల్లలు పొట్టిగా ఉంటారన్నమాట!

సృష్టిలో అన్ని జంతువులూ నిద్రపోతాయి. నిద్రకూ, శరీర పరిమాణానికీ మాత్రం ఏ సంబంధం లేదు. కుందేళ్ళు మనంతసేపూ నిద్రపోతే, గుర్రాలు మూడు గంటలు కూడా నిద్రపోవు. గొరిల్లాలు పన్నెండు గంటలు పడుకుంటాయట.

థామస్ ఆల్వా ఎడిసన్ ఎలక్ట్రిక్ బల్బ్ కనిపెట్టేదాకా జనం రోజుకు సగటున తొమ్మిది గంటలు నిద్రపోయేవారుట. ఆయన కనిపెట్టిన బల్బు పేరు చెప్పి ప్రతి మనిషికీ ఏడాదికి 500 గంటల నిద్ర తగ్గిపోయిందిట. మరిప్పుడు టీవీ ఛానెల్సూ, ఇంటర్నెట్టూ వచ్చాయి. అలాగని

పసుంధర

నిద్రను అలక్ష్యంచేస్తే ఏం జరుగుతోందో తెలుసా- విద్యార్థులు పరీక్షలు బాగా వ్రాయలేరు. పెద్దలు జోక్సుకి నవ్వలేరు. బలహీనులు రోగాలకు తట్టుకోలేరు. ప్రమాదాలు రోడ్లమీదా, విమానాల్లోనే కాదు- రాకెట్లలోనూ, న్యూక్లియర్ రియాక్టర్లలోనూ కూడా జరుగుతాయి.

కాబట్టి మెలకువగా ఉన్న కాలాన్ని నూటికి నూరుపాళ్ళు సద్వినియోగం చేయగల నిద్రను అలక్ష్యం చేయకండి!

## నమ్మండి, నమ్మండి!

★ దేవుడున్నాడని కొందరు, లేడని కొందరు అంటూంటే చూపిస్తామని అనే వారూ ఉంటారు.



తైవాన్లో చెన్ హింగ్ మింగ్ అనే భక్తిపరుడు తన అనుచరులతో ఒక మాట చెప్పాడు. ఆ ప్రకారం మార్చి 31న ఉదయం పదిన్నరకు దేవుడు భూమ్మీదకు అడుగుపెట్టి మానవాళిని పునీతం చేస్తాడట. తన రాకను తెలియజేస్తూ దేవుడు మానవాళికి ఒక ప్రత్యేక సందేశాన్నివ్వనున్నాడనీ అది మార్చి 24న అమెరికాలోని టెలివిజన్లో చానల్లో 18లో సరిగ్గా రాత్రి 12 గంటలకు కనబడుతుందనీ కూడా ఆయన తన అనుచరులను నమ్మించాడు. దాంతో ఆయన, అనుచరులు ఆ రోజుకు అమెరికాలోని టెక్సాస్లోని గార్లాండ్ చేరుకున్నారు. అయితే టైము 12 దాటిపోయినా దేవుడి సందేశం ఏమీ కనబడలేదు. అప్పుడాయన తన అనుచరులతో, "నావల్ల పొరపాటైంది" అని ఊరుకున్నాట్ట. అయితే అంత మాత్రాన తను అబద్ధాల కోరునైపోననీ మున్ముందు ఏమి జరుగనున్నదో వేచి చూడండనీ కూడా ఆ భక్త శిఖామణి అంటున్నాడట.

★ అసలు సిసలు కవలలంటే వారే! ఇద్దరూ ఒక్కలాగే ఉంటారు. ఒకే నర్సరీలో చేరారు. ఒకే స్కూల్లో చదివారు. ఒకే కాలేజిలో శిక్షణ పొందారు. ఇద్దరూ అన్నదమ్ముల్ని పెళ్ళి చేసుకున్నారు. వారికి ఒకరంటే ఒకరికి అసూయ లేదు. ఎంతో అన్యోన్యంగా ఆ దంపతులు జీవించారు. ఆ తర్వాత విశేషమేమిటంటే ఇద్దరూ ఒకే ఆస్పత్రిలో ఓ గంట తేడాలో అచ్చం ఒకేలాంటి మగబిడ్డల్ని కన్నారు. ఈ విచిత్రం ఇజ్రాయెల్లోని నాటన్యా నగరంలో జరిగింది.

★ ఆస్ట్రేలియాకు చెందిన బోర్డర్ క్రికెట్ టెస్టు పోటీలలో సునీల్ గవాస్కర్ నెలకొల్పిన ఎక్కువ పరుగుల రికార్డును బద్దలు కొట్టాడు. అందుకు ప్రతీకారం అన్నట్టుగా ఇప్పుడు ఇండియన్ కెప్టెన్ అజరుద్దీన్ ఎక్కువ వన్డే క్రికెట్ మ్యాచిలు ఆడిన బోర్డర్ రికార్డును బద్దలు కొట్టాడు. బోర్డర్ ఆడిన

మ్యాచిలు *273 అయితే అజరుద్దీన్ కొచ్చిన్లో ఏప్రిల్ 1న ఆస్ట్రేలియా మీద 274వ మ్యాచీ, ఏప్రిల్ 5న జింబాబ్వే మీద 275వ మ్యాచీ ఆడడమేకాక ఆ రెండూ నెగ్గాడు కూడా!

## హోమియోపతీ

మనిషి ఆరోగ్యానికి పలురకాల వైద్యాలు



ఉన్నా అల్లోపతీ ప్రథమ స్థానం వహిస్తుంది. ఏ జబ్బునైనా గుర్తించి, తగ్గించగల ఈ వైద్య విధానం కలవారికి సాయపడినంతగా లేనివారికి సాయపడదు. అయుర్వేదం కొంత నయమైనా- ఆహార నియమాలు కఠోరం కాబట్టి సామాన్యులకు ఇబ్బంది.

కేవలం సామాన్యుల కోసమే అన్నట్లు పేదల పాలిటి పెన్నిధిగా వచ్చిన హోమియోపతీ వైద్యాన్ని శామ్యూల్ హానేమన్ అనే అల్లోపతీ డాక్టరు కనిపెట్టాడు. జర్మనీకి చెందిన ఈయన క్రీ.శ. 1755లో పుట్టి 1843లో మరణించాడు.

ఏ పదార్థమైతే ఆరోగ్యంగా ఉన్న మనిషికి ప్రత్యేకమైన జబ్బును కలిగించగలదో ఆ పదార్థమే ఆ జబ్బుతో బాధపడే రోగికి నివారణోపాయం కాగలదన్న సూత్రం మీద ఈ వైద్య విధానం ఆధారపడింది. అంటే ఉష్ణం ఉష్ణేన శీతలం అని మన పెద్దలు చెప్పినది అక్షరాలా నిజమన్నమాట.

ఇందులో మందు కషాయాన్ని ఎంత పల్చన చేస్తే అంత మంచిది. ఉదాహరణకు ఒక చుక్క కషాయాన్ని 99 ఆల్కహాలు చుక్కలతో కలిపితే దాన్ని 1c అంటారు. అందులోంచి ఒక చుక్క తీసుకుని దానికి 99 చుక్కల ఆల్కహాలు కలిపితే దాన్ని 2c అంటారు. అవసరాన్ని బట్టి మందును ఇంకా ఇంకా పల్చన చేస్తారు. అంటే ఒకోసారి ఇంచుమించు అందులో మందు లేనట్లే. అయినా అది పని చేస్తుంది. ఇంత తక్కువ పరిమాణంలో మందులు వాడడంవల్ల శరీరంపై వాటి చెడు ప్రభావముండదు.

హోమియోపతీ వైద్యం శరీరాన్నీ, శరీర గుణాన్నీ (చైతన్యం) వరిగణబలోనికి తీసుకుంటుంది. శరీరం వ్యాధికి గురైనప్పుడు చైతన్యం వ్యాధిని నిరోధిస్తుంది. చైతన్యం బలహీనపడితే మనిషి వ్యాధిగ్రస్థుడవుతాడు. చైతన్యాన్ని బలపూరితం చేయగలిగితే వ్యాధి దానం తటదే నివారించబడుతుందని హోమియో పతీ వైద్యులంటారు.

ప్రస్తుతం హోమియోపతీ వైద్యం అపద్ధర్మంగా మాత్రమేకాక అద్భుత చికిత్సగా అందరినీ ఆకర్షిస్తున్నది.

# ఉత్కళరత్న శ్రీరాధానాథరథీ అస్తమయం

ఆయన పేరు రాధానాథరథ్. ఆయన క్రీ.శ. 1896లో డిసెంబరు 6న ఒరిస్సాలో జన్మించారు. తండ్రి జగన్నాథరథీ. తల్లి కమలాదేవి. కటక్‌లో సుభాష్ బోస్‌తోపాటు మెట్రిక్‌దాకా చదివేక ఆర్థిక కారణాలవల్ల చదువు ఆపేశారు. 1919లో పండిట్ గోపబంధుదాస్ పిలుపునందుకుని ఒరియా దినపత్రిక "సమాజ్"లో ఎగ్జిక్యూటివ్ ఎడిటర్‌గా చేరారు. తర్వాత ఆ పత్రికకు ఎడిటరై తుదిశ్వాస విడిచే వరకూ ఆ పదవిలో కొనసాగేరు. అంతకాలం ఎవరైనా ఒక దినపత్రికకు సంపాదకులుగా మనగలగడం బహుశా ప్రపంచ రికార్డు అయి ఉండొచ్చు.

జాతీయతాభావం, సత్యసంధత, స్వేచ్ఛ ఆధారంగా నడుపబడిన సమాజ్ దినపత్రిక స్వతంత్ర పోరాటకాలంలో బ్రిటిష్ వ్యతిరేక శక్తిగానూ, స్వతంత్ర భారతంలో నిరుపేదల అణచివేతనూ, ప్రభుత్వపు తప్పటడుగుల్నీ, ప్రజాస్వామ్యంలోని అవినీతినీ వేటాడే యుక్తిగానూ విలసిల్లిందంటే శ్రీ రాధానాథ్ రథీ అందుకు కారణం. ఆ పత్రిక ఒరియావారి ప్రియతమ పత్రిక. ఆయన ఒరియావారి ప్రియతమ వ్యక్తి. కళింగ సింహంగా అభిమానించబడే బిజూపట్నాయక్‌తో సరిసమానుడిగా భావించే ఒరియావారు- ఆ యిద్దరికీ భారత రత్న బిరుద ప్రదానం జరిగే రోజు ఎంతో దూరంలో లేదని నమ్ముతారు.

ఎక్కువగా చదువుకోని రాధానాథ్ ప్రముఖ దినపత్రిక సంపాదకులే కాదు- ఒరిస్సా రాష్ట్ర విద్యాశాఖామంత్రిగా కూడా పని చేశారు. ఇంకా ఆయన ఆర్థిక, వ్యవసాయశాఖామంత్రిగా కూడా పని చేశారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని ఆరు సంవత్సరాలకాలం వివిధ కారాగారాల్లో బందీగా ఉన్నారాయన. ఆయన కవిత్వానికి ఒరిస్సా సాహిత్య అకాడమీ అవార్డు వచ్చింది. ఒరిస్సా యూనివర్సిటీ ఆఫ్ అగ్రికల్చర్ అండ్ టెక్నాలజీకి ఆయన వైస్ ఛాన్సలర్ అయితే బర్హంపూర్ విశ్వవిద్యాలయం ఆయన్ను డాక్టరేట్ పట్టంతో గౌరవించింది. 1993లో ఉత్కళరత్న అవార్డు నందుకున్న ఆ మహనీయుడు 1968లోనే కేంద్రప్రభుత్వం నుంచి "పద్మభూషణ్" అందుకున్నారు. "బాబూజీ"గా అందరూ పిలిచే శ్రీ రాధానాథ్ రథీ తన 102వ ఏట (ఫిబ్రవరి 12, 1998) తనువు చాలించారు. ఆయనకు బొమ్మరిల్లు నివాళులు.



# వేషంలో లీనం

అవంతీపురం నగరం పొలిమేరల్లో సదానందుడి ఆశ్రమం వుంది. కొన్ని వందల ఎకరాల విస్తీర్ణంలో వున్న సదానందుడి ఆశ్రమంలో కేవలం ధార్మిక కార్యక్రమాలే కాకుండా, ఎన్నో సేవా కార్యక్రమాలు కూడా నిర్వహించబడు తుండేవి.

ఆశ్రమ నిర్వహణకు మహారాజు విజయవర్మ సహాయం అర్థిస్తూ వర్తమానం పంపాడు సదా నందుడు.

ఆయన పట్ల వున్న భక్తి భావంతో విజయవర్మే స్వయంగా మందీ మార్బలంతో ఆశ్రమానికి విచ్చేశాడు.

మహారాజు వచ్చిన సందర్భంలో ప్రత్యేక సాంస్కృతిక కార్యక్రమాలు ఏర్పాటు చేశారు.

ఓ పౌరాణిక నాటకంలో ముని పాత్ర ధారి నటన మహారాజు విజయవర్మని విశేషంగా ఆకట్టుకుంది.

తన మెడలోని రత్నాల హారం ఆ నటుడికిస్తూ "బాగుందోయ్ నీ నటన! మరింతగా కృషి చేయ్" అన్నాడు విజయవర్మ.

ఆ నటుడు సున్నితంగా ఆ బహుమతి తిరస్కరించి, "క్షమించండి మహారాజా! నేను పవిత్రమైన మునివేషంలో వున్నాను. మునులకు, యోగులకు ధనం గడ్డిపోచతో సమానం. అందువల్లే



స్వీకరించ లేకపోతున్నాను" అన్నాడు.

ఆ మాటలు సదానందుడికి కొరడా దెబ్బల్లా తగిలాయి. ఆ రోజు నుంచి ఆయన విరాళాలు అర్థించడం మానేశాడు.

- పుష్యమి



# అమృతాచార్యుడు

త్రయ్యారుణుడు అనే సూర్యవంశపు రాజుకు సత్యవ్రతుడనే కుమారుడుండేవాడు. అతడు యౌవన మదంతో ఒక యువకునితో పోట్లాట పెట్టుకుని ఓడించి, విజయ చిహ్నంగా ఆ యువకుడి భార్యను ఎత్తుకొచ్చాడు.

ఈ విషయం తెలియగానే త్రయ్యారుణుడు మండిపడి, "సన్మార్గాన నడుస్తావని నీకు సత్య వ్రతుడని పేరు పెట్టాను. కానీ నువ్వు జంతువులా ప్రవర్తించి నీ పేరుకే కళంకం తెచ్చావు. నీకు నా దేశంలో స్థానం లేదు. తక్షణం వెళ్ళిపో-" అని ఆజ్ఞాపించాడు.

సత్యవ్రతుడు ఖిన్నుడై, "ఉన్నపళంగా పొమ్మంటే ఎక్కడకు పోగలను? అయినా నీవు నా తండ్రివి. నన్నాదరించాలే తప్ప పొమ్మనే హక్కు నీకు లేదు." అన్నాడు.

"నీవు చెప్పే నియమాలు మనుషులకు వర్తిస్తాయి. పర స్త్రీలను ఎత్తుకొచ్చిన నీవు జంతువుతో సమానం. మారుమాట చెప్పకుండా ఇక్కణ్ణించి వెళ్ళిపో. జంతువులతోనే, జంతువుల్లాంటి మనుషులతోనో కలిసి జీవించు" అన్నాడు త్రయ్యారుణుడు.

అప్పుడు సత్యవ్రతుడు తండ్రి పక్కనే ఉన్న కులగురువు వశిష్టుడి వంక ఆశగా చూశాడు. అయితే వశిష్టుడతణ్ణి ఆదుకోక త్రయ్యారుణుణ్ణే సమర్థించి తనూ సత్యవ్రతుణ్ణి నిందించాడు.

చేసేదిలేక సత్యవ్రతుడు నగరం విడిచి పెట్టాడు.

అప్పుడా రాజ్యంలో క్షామం వచ్చింది. ప్రజలు తిండిలేక మల మల మాడిపోతున్నారు. ఆ కష్ట సమయంలో వశిష్టుడు తన తపోశక్తితో రాజ కుటుంబాన్ని మాత్రం రక్షిస్తున్నాడు.

ఆ దేశంలోనే విశ్వామిత్ర మహర్షి ఉంటున్నాడు. ఆకలి బాధకు తట్టుకోలేక ఆయన తన కుమారులలో మధ్యముడైన గాలవుడనే వాడి మెడకు తాడు తగిలించి వీధులన్నీ త్రిప్పుతూ, "ఈ బాలుని తీసు కుని ఎవరైనా నూరు గోవులిచ్చి

(అపూర్వగాథలు-70)

నా కుటుంబాన్ని రక్షించండి" అని అడగసాగాడు.

ఆ సమయంలో ఆ దారినే పోతున్న సత్య వ్రతుడు గాలవుడి అవస్థ చూడలేక, "విశ్వామిత్రా! నీ కుటుంబాన్ని నేను పోషిస్తాను. గాలవుడినీ గళబంధం నుంచి విముక్తుణ్ణి చెయ్యి" అన్నాడు. విశ్వామిత్రుడు అలాగే చేశాడు.

మాటైతే ఇచ్చాడు కానీ సత్యవ్రతుడికి ఆ తర్వాత ఏం చేయాలో తోచలేదు. ఒక్క మనిషికే తిండి దొరకడానికి కష్టంగా ఉన్న ఆ కరువు రోజుల్లో విశ్వామిత్రుణ్ణీ, ఆయన కుటుంబాన్నీ ఎలా పోషించాలా అని ఆలోచిస్తూండగా అతడికి వశిష్టుడు గుర్తుకొచ్చాడు.

ఆ సమయంలో వశిష్టుడొక్కడే పచ్చగా ఉన్నాడు. అదీకాక తండ్రి తనను పొమ్మంటే వశిష్టుడు కాదనలేదు సరికదా తనూ సమర్థించాడు. అటు మాటా నిలబడుతుంది. ఇటు పగా తీరుతుంది అనుకుని సత్యవ్రతుడు వశిష్టుడింటికి వెళ్ళి అక్కడ కనపడిన ఆయన ధేనువును చంపాడు. అప్పు డతడికి విపరీతంగా ఆకలి వేసింది. దానికి తట్టు కోలేక అక్కడ ఏమి కనబడితే దాన్ని భుజించ సాగాడు.

అప్పుడు వశిష్టుడు అక్కడకు వచ్చి జరిగింది చూసి, "అప్రాచ్యుడా! తండ్రి మనసును కష్టపెట్టావు. గురుధేనువును సంహరించావు. అప్రోక్షితాహారాన్ని భుజించావు. మూడుసార్లు త్రిశంకువులు కల్పించుకున్నావు కాబట్టి ఇక నుంచి నీ పేరు త్రిశంకు అవుతుంది" అంటూ తిట్టాడు.

ఇది తెలిసిన త్రయ్యారుణుడక్కడకు వచ్చి, ' 'నీ మీద నా మనసు పూర్తిగా విరిగిపోయింది. నీకిక రాజ్యార్హత లేదు. పో" అంటూ చీదరించు





కున్నాడు.

త్రిశంకు రాజు కాలేకపోయినా విశ్వామిత్రుడి కిచ్చిన మాట మాత్రం నిలబెట్టుకున్నాడు. అందుకు విశ్వామిత్రుడెంతో సంతోషించి కరువు కాలం తీరినాక సత్యవ్రతుడికేం కావాలో కోరుకొమ్మన్నాడు.

"మహర్షీ! తమ కుటుంబం ఆకలి తీర్చలేని తమరు నా కోరిక నెలా తీర్చగలరు?" అని త్రిశంకు ఆయనకు తన అనుమానాన్ని చెప్పాడు.

విశ్వామిత్రుడు నవ్వి, "తపోబలాన్ని స్వార్థానికి కాక పరోపకార పరాయణుల మేలుకు ఉపయోగించడం మహర్షుల ధర్మం. ఆ ధర్మాన్ని నేను ఉల్లంఘించను" అన్నాడు.

తనను బొందితో స్వర్గానికి పంపమని కోరాడు త్రిశంకు. విశ్వామిత్రుడలాగే చేశాడు కానీ దేవతలతణ్ణి స్వర్గంలోకి రానివ్వక క్రిందకు తోసేశారు. అప్పుడు విశ్వామిత్రుడు త్రిశంకును మధ్యలో ఆపి అక్కడి కక్కడ స్వర్గాన్ని సృష్టించాడు. అది త్రిశంకు స్వర్గంగా జగత్ప్రసిద్ధమయింది.

త్రిశంకు కథ అలా ముగిసింది. అతడిచేత రక్షించబడ్డ గాలవుడు అడవికి పోయి తపస్సు ప్రారంభించి గాలవ మహర్షిగా పేరు తెచ్చుకున్నాడు.

ఒకరోజున గాలవుడు అడవిలో దర్భలు, ఎండుకట్టెలు అన్వేషిస్తూ చాలాదూరం వెళ్ళాడు. కాసేపటికి అతడు అలసిపోయి చెప్పలేనంత దాహానికి గురయ్యాడు. సమీపంలో జలాశయ ముందేమోనని చుట్టూ చూస్తే- అది జనావాస ప్రాంతమనీ అడవిని దాటి చాలా దూరం వచ్చాననీ అర్థమయిందతడికి. అడుగు ముందుకు వెయ్యలేక అక్కడే నీరసంగా కూలబడ్డాడతడు.

ఆ సమయంలో నీళ్ళ బిందెతో వెడుతున్న ఒక యువతి గాలవుణ్ణి చూసింది. ఆమె ఆగి, విషయం తెలుసుకుని గాలవుడికి మంచినీళ్ళిచ్చి దాహం తీర్చింది.

గాలవుడెంతో సంతోషించి, "దాహ బాధ భరించలేక ప్రాణం పోనున్నదనుకుంటున్న తరుణంలో అమృతమూర్తిలా వచ్చి నా దాహం తీర్చి నా ప్రాణాలు నిలబెట్టావు. నీకు త్వరలోనే అమృతం గుణాలున్న కొడుకు పుడతాడు" అంటూ మనస్ఫూర్తిగా దీవించాడు.

ఆ యువతి సిగ్గుపడుతూ, "తమరు మహర్షి! తమరి వాక్కు అమోఘం. కానీ కన్యనైన నన్ను కళ్యాణమస్తు అని దీవించకుండా సంతానవతిని కమ్మని దీవించడం తమకు న్యాయమా?" అనడిగింది.

గాలవుడు గతుక్కుమని, "ఇటువంటి పొరపాటు నావల్ల జరుగదు. అందుకు దైవ నిర్ణయమే కారణమయుండాలి. నీకు తొందరలోనే వివాహం కావచ్చునేమో!" అన్నాడు.

"ఆర్యా! నేను వైశ్యకన్యను. నా తండ్రి ఆర్థిక పరంగా ఇబ్బందుల్లో ఉన్నాడు. తొందరలో నా వివాహం జరిపించడం ఆయనకు సాధ్యం కాదు" అన్నదా యువతి కలవర పడుతూ.

అప్పుడు గాలవుడు, "నేను తపస్విని. నా వాక్కు వృథా కారాదు. నీకు అన్యాయం జరుగరాదు" అంటూ తన చేతిలోని ఒక దర్భను నేలమీద ఉంచి ఏవో మంత్రాలు చదివాడు. చూనన్తాండగా ఆ దర్భ ఒక యువకుడిగా మారిపోయింది.

గాలవుడా యువతీ యువకుల చేతులు కలిపి, "ఈ క్షణం నుండీ మీరు దంపతులు. సుఖంగా జీవిస్తారు. మీ కుమారుడు కీర్తిమంతుడై మీకు పేరు తెస్తాడు" అన్నాడు.

అప్పుడా వైశ్య బాలిక, దర్భ యువకుణ్ణి తీసుకుని ఇంటికి వెళ్ళి జరిగినదంతా చెప్పింది. ఆమె తలిదండ్రులు ఎంతో సంతోషించి కూతుర్నీ, అల్లుణ్ణీ ఆప్యాయంగా ఆదరించారు.

కొంత కాలానికా దంపతులకు ముద్దులు మూటగట్టే కొడుకు పుట్టాడు. అతడు పెరిగి పెద్దవాడై వైద్యశాస్త్రంలో నిధి అయ్యాడు. ఆయుర్వేద వైద్య విధానంలో అద్భుత చికిత్సలు చేస్తూ ప్రజలందరి మన్ననలూ పొందాడు. శవానికి కూడా ప్రాణం పోయగలవాడని అతణ్ణి మెచ్చుకుంటూ ప్రజానీకం "అమృతాచార్యుడ"న్న బిరుదునతడికిచ్చింది. కొన్నాళ్లకు ఆ బిరుదే అతడి పేరుగా చలామణీ అయిపోయింది.

-జె.మార్కండేయులు







# సంప్రదాయం

అనగనగా ఒక రాజు. ఆ రాజుకు ఇద్దరు కొడుకులు. పెద్దవాడు అజయుడు. రెండోవాడు విజయుడు. ఇద్దరూ గురుకులంలో సకల విద్యలూ నేర్చుకుని తిరిగి వచ్చారు.

రాజు కొడుకులిద్దరి శక్తి సామర్థ్యాలనూ పరీక్షించాడు. ఇద్దరూ అన్నివిధాలా సరి సమానులని తెలుసుకుని ఎంతగానో సంతోషించాడు. తనయులిద్దర్నీ ఏమైనా కోరుకోమన్నాడు.

అజయుడు వెంటనే, "విశాలపురి రాకుమార్తె కళ్యాణిని నేను ప్రేమించాను. మా యిద్దరికీ వివాహం జరిపించండి" అన్నాడు.

విశాలపురి చిన్న రాజ్యం. ఆ దేశపు రాజు అనంతుడికి ఆత్మ గౌరవం ఎక్కువ. ఒకసారి అనంతుడు అజయుడి తండ్రిని అరణ్యంలో కలుసుకున్నాడు. ఇద్దరూ అక్కడికి వేటకనే వెళ్ళారు. అనంతుడు దురదృష్టం కొద్దీ గుర్రం మీంచి కింద పడ్డాడు. కింద రాయి ఉండడంతో తలకు గాయమై స్పృహ తప్పింది. అదే సమయంలో అటుగా వచ్చిన అజయుడి తండ్రి అనంతుడికి ప్రథమ చికిత్స చేసి స్పృహ తెప్పించాడు.

స్పృహ రాగానే జరిగింది తెలుసుకుని, "నీ పరోపకార గుణం కొనియాడతగ్గది. కలకాలం సుఖంగా వర్థిల్లమని నేను నిన్ను దీవిస్తున్నాను" అన్నాడు.

"సాటి రాజును నీవు దీవించడమేమిటి?" అన్నాడు అజయుడి తండ్రి ఆశ్చర్యపడుతూ.

"వయసులో నేను నీకంటె మూడు మాసాలు పెద్దవాణ్ణి. పిన్నలను దీవించడం పెద్దల బాధ్యత" అన్నాడు అనంతుడు.

"శతవృద్ధుడైన పేదవాడు ముక్కు పచ్చలారని యువరాజుకు నమస్కరిస్తాడు. పెద్దరికం వయసుతో రాదు. పదవితో వస్తుంది. నాది పెద్ద రాజ్యం. నీది చిన్న రాజ్యం. నీవు నన్ను దీవించదగవు. నాకు నమస్కరించాలి" అన్నాడు. అజయుడి తండ్రి కోపంగా.

"భగవంతుడు నీకు పరోపకార గుణంతోపాటు

వసుంధర

అహంకారాన్ని కూడా యిచ్చాడు. అది విడిచిపెట్టే దాకా నీకు పెద్దా చిన్నా తేడా తెలియదు. అది తెలిసేదాకా నేను నీతో మరి మాట్లాడను" అని వెళ్ళిపోయాడు అనంతుడు.

అజయుడి తండ్రికి కోపం వచ్చింది. రాజధానికి తిరిగి వెళ్ళేక ఆయన విశాలపురిపై దండెత్తి అనంతుడి మదమణచాలనుకున్నాడు. అయితే అనంతుడికి పలు రాజ్యాలతో సత్సంబంధాలున్నాయి. ఆ రాజ్యాలన్నీ ఆయనకు బాసటగా వచ్చినా రాకపోయినా అకారణంగా కయ్యానికి కాలు దువ్వేడని అజయుడి తండ్రికి చెడ్డ పేరు వస్తుంది. అందుకని ఆయన తన అక్కసునంతా మనసులో దాచుకున్నాడు. ఆ విషయం ఇంట్లో వారందరికీ తెలుసు.

ఇప్పుడు కళ్యాణిని కోడలిగా చేసుకోవాలంటే ఆయన అహంకారాన్ని చంపుకుని అనంతుడిని అర్థించాలి. అందుకని, "నీ కోరిక ఎంతో కష్టమైనది. ఎలా తీర్చాలో ఆలోచిస్తాను" అన్నాడు. అజయుడు వెళ్ళిపోయాడు.

రాజు విజయుణ్ణి, "నీ కోరికేమిటో చెప్పు!" అన్నాడు.

"నాకు రాజును కావాలనుంది. నా కోరిక తీర్చితే నేను వెంటనే విశాలపురి మీద దండెత్తి ఆ రాజ్యాన్ని లోబర్చుకుని కళ్యాణిని తెచ్చి మీకు అప్పగిస్తాను. మీరు అన్నకు ఆమెనిచ్చి వివాహం జరిపించవచ్చు" అన్నాడు విజయుడు.

రాజు క్షణం కూడా ఆలోచించకుండా, "నాకు అజయుడి కోరిక తీర్చడం సాధ్యపడుతుందేమో కానీ



నీ కోరిక తీర్చడం వీలు కాదు. రాజ్యం అజయుడికే చెందుతుంది. పెద్దవాడైన అజయుణ్ణి కాదని వేరెవ్వర్నీ రాజును చెయ్యలేను" అన్నాడు.

"అన్ని విధాలా నేను అన్నతో సమానుణ్ణి. కాస్త ఆలస్యంగా పుట్టానని నన్ను రాజును చేయననడం భావ్యం కాదు. అదీకాక అన్న రాజును కావాలని కోరలేదు" అన్నాడు. విజయుడు.

"నీవు అన్నకంటే అధికుడివైనా రాజ్యం అన్నకే చెందుతుంది. అడిగినా అడుగకున్నా ఈ రాజ్యం అజయుడిదే! ఈ విషయంలో నా నిర్ణయానికి తిరుగులేదు. నీవు వేరేదైనా కోరుకో" అన్నాడు రాజు.

విజయుడు దిగాలుపడి, "నేను చేయని తప్పుకు నాకు చాలా అన్యాయం జరిగిపోతోంది" అన్నాడు.

కొడుకు ఆలోచన తప్పు దారి పడుతోందని

గ్రహించిన రాజు, "నాయనా! ఉద్దండపురంలో ప్రచండుడనే వాడున్నాడు. వాడు నకల విద్యల్లోనూ ప్రవీణుడు. నీవు వాడి నోడించి రాగలిగితే నిన్ను రాజును చేయడం గురించి ఆలోచిస్తాను" అన్నాడు.

విజయుడు వెంటనే ఉత్సాహంగా ఉద్దండపురం వెళ్ళి ప్రచండుణ్ణి కలుసుకున్నాడు. కానీ ఏ విద్యలోనూ వాడిని ఓడించలేకపోయాడు.

అయినా విజయుడు నిరుత్సాహపడక, "రాజధానికి వచ్చి నా అన్నను సవాలుచేయి. నువ్వు అతడినీ ఓడించగలవో లేదో చూడాలనుంది" అన్నాడు.

"అందువల్ల నాకేమి లాభం? నేనేమీ రాజును కాలేను కదా!" అన్నాడు ప్రచండుడు నీరసంగా.

వాడికీ రాజు కావాలనుందనీ కానీ రాజవంశంలో పుట్టలేదు కాబట్టి వాడికి రాజయ్యే అవకాశం లేదనీ అర్థమయ్యేక విజయుడికి తన కోరికలోని తప్పు తెలిసి వచ్చింది.

విజయుడు రాజధానికి తిరిగి వెళ్ళి, "నేను నా తప్పు తెలుసుకున్నాను. రాజరికమంటే ఏమిటో గ్రహించాను. అన్న పెళ్ళి విషయంలో నాకో ఉపాయం కూడా ఇప్పుడే తట్టింది. మీరు వెంటనే అన్నను రాజ్యాభిషిక్తుణ్ణి చేయండి. అన్న రాజైతే వయసులో చిన్నైనా, స్వయంగా మీ కొడుకే అయినా మీరు గౌరవించితీరాలి. అన్న ఆజ్ఞ మీద మీరు అనంతుడిని కలుసుకుని కళ్యాణిని కోడలిగా అడగండి" అన్నాడు.

అప్పుడు రాజుకు తన తప్పు తెలియ వచ్చింది. ఆయన అనంతుణ్ణి కలుసుకుని కళ్యాణి గురించి అడిగాడు. అనంతుడాయనకు వెంటనే నమస్కరించి, "పిల్లనడుగవచ్చిన వారికి చేయెత్తి నమస్కరించడం మా సంప్రదాయం" అన్నాడు.

తన కొడుకు పెళ్ళి పేరు చెప్పి తన కోరిక ఇలా తీరుతుందని ఊహించని రాజు, "ఈ ప్రపంచాన్ని శాసిస్తున్నది వయసూ కాదు, శక్తీకాదు, పదవీ కాదు, సంప్రదాయం ఒక్కటే!'' అని మనసులో అనుకున్నాడు.





# కాంతయ్య అపూర్వ వస్తువులు

గోదావరీ తీరాన కట్టుంగ అనే గ్రామంలో కాంతయ్య అనే స్థితిపరుడుండేవాడు. అందరూ తన గురించి ప్రత్యేకంగా చెప్పుకోవాలని ఆయన కోరిక. అందుకని ఆయన ఒక గుర్రబ్బండిని కొన్నాడు. దానిని ప్రత్యేకంగా అలంకరింపజేసి తోలడానికి ఓ మనిషిని పెట్టుకున్నాడు. ఎక్కడికి వెళ్ళినా ఆ గుర్రబ్బండిలోనే ప్రయాణం చేసేవాడు.

పక్క గ్రామం మునసబు కాంతయ్యకు బంధువు. ఆ మునసబింట్లో పెళ్ళి జరుగుతూంటే కాంతయ్య పిలుపందుకుని గుర్రబ్బండిలో బయల్దేరాడు. బండి ఊరి పొలిమేర దాటిందో లేదో ఓ మనిషి చేయెత్తి ఆపమంటూ దారికడ్డంగా నిలబడ్డాడు.

ఆయన పేరు రామనాథం. విస్సన్నపేట జమీందారు ఆస్థానకవి. మునసబుగారింట పెళ్ళిలో ఆశీర్వచనం పద్యాలు చదవమని జమీందారాయన్ను పంపాడు. ఆయనా గుర్రబ్బండిలోనే వచ్చాడు. అక్కడి దాకా వచ్చేక ఏం జరిగిందో ఏమో గుర్రం కూలబడి పోయింది. అదృష్టవశాత్తూ ఆయనకూ, బండివాడికీ దెబ్బలు తగల్లేదు. ఇద్దరూ బండి దిగారు. అంతలోనే గుర్రం లేచి బండిని మరో దిశగా లాక్కుంటూ పరుగెత్తింది. బండివాడు గుర్రాన్ని వెతుక్కుంటూ అటే పోయాడు. వాడెప్పుడొస్తాడో తెలియదు. ఈలోగా రామనాథానికి కాంతయ్య గుర్రబ్బండి కనిపించింది.

రామనాథం జమీందారు ఆస్థానకవి అని తెలియగానే కాంతయ్య సంతోషంగా ఆయన్ను బండిలో ఎక్కించుకున్నాడు. కాంతయ్యది కట్టుంగ అని తెలియగానే రామనాథం ఎంతో సంతోషించి శివాలయానికి దగ్గర్లో తనకు అయిదు తరాల పూర్వీకుల ఇల్లొకటుండేదని చెప్పాడు.

కాంతయ్య ఆశ్చర్యంగా, "ఆ యిల్లు తమరిదా? అది ఇప్పటికీ ఉంది." అన్నాడు.

రామనాథం బాధగా, "విస్సన్నపేట సంస్థానానికి ఆస్థానకవి అన్నమయ్య అప్పట్లో ఉండేవాడు. కట్టుంగ ఆలయంలోని శివుడి మీద గొప్ప శతకాన్ని వ్రాశాడు. ఆ శతకాన్ని చదివిన జమీందారుగారికి కష్టాలు తొలగిపోయాయట. అప్పట్నించే మా

జె.ఉదయ నాగశిరీష



పూర్వీకులు విస్సన్నపేట సంస్థానానికి ఆస్థాన కవులయ్యారు. విస్సన్న పేటకు తరలి వెళ్ళారు. అయినా స్వంత ఊరును మరువలేక అన్నమయ్య తన పేరును కట్టుంగ అన్నమయ్యగా చెప్పుకునే వాడు. కట్టుంగలో ఆ యింటి వైభవం గురించి కథలు కథలుగా చెప్పుకుంటాం మేమందరం" అన్నాడు.

కాంతయ్య తరచి తరచి అడగ్గా రామనాథం ఆ యింటి విశేషాలు కొన్ని చెప్పాడు. అన్నమయ్య, ఆయన భార్య ఆదర్శదంపతులు. దాన ధర్మాల్లో ఒకరితో ఒకరు పోటీ పడేవారు. అర్ధరాత్రి పూట తలుపు తట్టిన వాడికి కూడా అప్పటికప్పుడు వండిపెట్టేది అన్నమయ్య భార్య. ఆ యింటి పాలేళ్ళందరూ ఆ యింట్లోనే భోం చేసేవారు.

ఒకసారి కట్టుంగలో శివకళ్యాణానికి జరిగిన తీర్థంలో ఒక రుబ్బురోళ్ళమ్మేవాడు పాల్గొన్నాడు. అన్నమయ్య దంపతులు వాడిని తలిదండ్రులకంటె అభిమానంగా ఆదరించారు. ఆ విశ్వాసంతో వాడు తన ఊరు వెళ్ళి పోయేముందు చక్కగా గంట్లు చెక్కిన రుబ్బురోలును తెచ్చి అన్నమయ్య యింటి పెరట్లో అమర్చి, "ఇది అరుదైన రాతితో చేయబడింది. ఇందులో రుబ్బిన పిండికి అద్భుతమైన రుచి ఉంటుంది" అని చెప్పాడు.

ఈ కథంతా ఆసక్తిగా విన్న రామయ్య ఆ యింట్లో ఇంకా ఏమున్నాయో తెలుసుకో గోరాడు.

"ఆ యింటిపెరట్లో ఒక మూల నాలుగడుగుల ఎత్తు జాడీ ఒకటి ఉంది. అప్పట్లో ఆ ఊళ్ళో ప్రసిద్ధికెక్కిన భద్రయ్య అనే కుమ్మరి ఆ జాడీని అన్నమయ్య కోసం ప్రత్యేకంగా చేసి యిచ్చాడట. అర్థరాత్రీ, అపరాత్రీ అనకుండా వచ్చే చుట్టాలకీ, ఇంటి పాలేళ్ళ భోజనాలకీ వడ్డించడం కోసం ఆ జాడీ నిండా వేరే అవకాయ పెట్టించి ఉంచే వారట. అందువల్ల ఇంట్లో మడిగా ఉంచుకున్న ఊరగాయలను అస్తమానూముట్టుకునే అవసరం తప్పిందట" అన్నాడు రామనాథం.

అప్పుడు కాంతయ్య బుర్రలో ఓ ఊహ మెదిలింది. ఇప్పటికీ కట్టుంగలో ఉన్న అన్నమయ్య యింటిని తనే కొని బాగు చేయించి ఆ యింటినొక అపూర్వ వస్తువుల ప్రదర్శనశాలగా మార్చితే అకారణంగా తనకూ సాలార్‌జంగుని కొచ్చినంత పేరు రావచ్చు నేమో! ముందుగా పురాతన పోకడలతో కట్టిన అయిల్లే ఒక అపూర్వం

ఆ పైన రుబ్బురోలు, ఊరగాయ జాడీ ఉండనే ఉన్నాయి. వాటితో మొదలు పెట్టేక క్రమంగా అలాంటి వస్తువులు మరిన్ని చేర్చవచ్చు.

కాంతయ్య ఆ యింటిని అపూర్వవస్తు ప్రదర్శన శాలగా మార్చుతాననగానే రామనాథం "అయ్యో, ఇంతవరకూ ఆయన వారసులమైన మాకే ఇంత మంచి ఊహ తట్టలేదు. అయితే మాలో ఎవరికీ కట్టుంగ వచ్చి ఉండే అవకాశంలేదు. కాబట్టి ఆ యిల్లు తప్పక మీకు అప్పగించే ఏర్పాటు చేస్తాను. మేమెవ్వరం దాన్ని ఆస్తిగా పరిగణించడం లేదు కాబటి మీరు తమకు తోచిన పైకం నామమాత్రంగా యిస్తే సరిపోతుంది" అన్నాడు.

ఇద్దరూ పెళ్ళికి వెళ్ళారు. అక్కడ తంతు ముగిసేక మునసబు వారికి ఇంటి మార్పిడి పత్రాలు వ్రాయించి పెట్టాడు.

కాంతయ్య కట్టుంగకు తిరిగి వెళ్ళి ఆ యింటి గురించి పెద్దగా ప్రచారం చేసి మరమ్మతులు ప్రారంభించాడు. ఇంటి ఆకారం చెడకుండా తిరిగి బలంగా ఉండేలా చేయమని ఆయన వడ్రంగికి ఆదేశించాడు. ఈలోగా ఆయన అపూర్వ వస్తువుల సేకరణకు పూనుకున్నాడు.

చాలామంది యిళ్ళలో అపూర్వ వస్తువులున్నాయి. వాటిని వాళ్ళు శ్రద్ధగా చూడ్డం లేదు కూడా! అయినా కాంతయ్య అడిగేసరికి వాళ్ళలో ఆశ పుట్టి ఎక్కువ ధర చెప్పసాగారు. కాంతయ్య కలిగిన వాడేకానీ అపూర్వ వస్తువుల కోసం తనకున్నదంతా పోగొట్టుకోలేడు కదా! అయినా ఉన్నదంతా పోగొట్టు కుంటే మాత్రం ఎన్ని అపూర్వ వస్తువులు వస్తాయి? అందుకని వాటి సేకరణ కోసం ఆయన ఇంకేదైనా ఉపాయం ఆలోచించాలనుకున్నాడు.





ఈలోగా అన్నమయ్య యింటికి మరమ్మతు పూర్తయింది. అంతకాలం రూపు రేఖలు లేని ఆ యిల్లు అందంగా మారింది. ఆకర్షణీయంగా తయారయింది. ఆ ఊళ్ళో అలాంటి యిల్లు అదొక్కటే కావడంతో ఆ యిల్లు చూడ్డానికే జనం విరగబడి వచ్చేవారు.

ఊరగాయ జాడీ, రుబ్బురోలు కాక ఆయింట్లోని ఓ గదిలో పాత కాలపు ఇనప్పెట్టె ఒకటి ఉంది. ఎంత ప్రయత్నించినా దాని తలుపులు తెరుచుకోలేదు. కాంతయ్య ఆ పెట్టెకు రంగులు వేయించి ఆకర్షణీయంగా తయారు చేయించేక తాళాలు బాగు చేయించే వాడినొకడిని తీసుకొచ్చాడు. వాడు ఎంతో ప్రయత్నించి మొత్తం మీద ఒక తాళం సాయంతో తలుపును తెరవగలిగాడు. అయితే తలుపు పూర్తిగా తెరిచేలోగానే "జాగ్రత్త, జాగ్రత్త" అంటూ కీచుగా శబ్దం రావడంతో వాడు హడిలిపోయి వెంటనే తలుపు మూసేశాడు.

కాంతయ్య కూడా ఇనప్పెట్టె లోపల ఏముందో చూడ్డానికి భయపడ్డాడు. అయితే తలుపు తెరవడానికి తనూ ఒక ప్రయత్నం చేసి "జాగ్రత్త" అన్న హెచ్చరిక వినబడగానే తలుపులు మూసేశాడు.

అందరికీ ఈ విషయం తెలిసింది. అన్నమయ్య యిల్లు చూడ్డానికి జనం తండోపతండాలుగా వచ్చారు.

అయితే కాంతయ్య ఊరికే ఎవరినీ ఆయింట్లో అడుగుపెట్ట నివ్వలేదు. ఆ యింటినీ, అపూర్వ వస్తువులనీ చూడాలనుకున్నావారికి ప్రవేశ రుసుము విధించాడు. ఇనప్పెట్టె తలుపు తీసి హెచ్చరిక వినాలనుకున్నవారు అదనపు రుసుము చెల్లించాలన్నాడు.

అంతేకాదు - ప్రతిరోజూ వంతుల వారీగా మనుషులను పెట్టి పెరట్లోని రుబ్బురోల్లో పచ్చళ్ళు రుబ్బించేవాడు. కావలసిన వారు అధిక ధరకు ఆ పచ్చళ్ళు కొనుక్కుని వాటి రుచి నిజంగానే అమోఘంగా ఉందని ఆశ్చర్యపోయేవారు.

అన్నమయ్య ఆత్మ ఇనప్పెట్టెను ఆవహించుకుని ఉన్నదనీ అది ఇనప్పెట్టెలోని వస్తువులను భద్రంగా కాపాడు తున్నదనీ ప్రచారం వచ్చింది. ఆనోట ఈనోట పడి ఆ వార్త రామనాథ కవిని చేరింది. ఆయన హుటాహుటిన కట్టుంగ గ్రామం వెళ్ళాడు. తన పూర్వీకుల యిల్లు కొత్త వైభవంతో కళకళలాడు తూండడం చూసి ఎంతో

సంతోషించి లోపలకు వెళ్ళబోగా ప్రవేశరుసుము గురించి తెలిసింది.

అప్పుడాయనకు చాలా కోపం వచ్చింది. తిన్నగా కాంతయ్య యింటికి వెళ్ళి ఆయన్ను కలుసుకుని, "తమరు మాయింటికి పేరు తెస్తారనుకున్నాను కానీ మా యింటి పేరుతో వ్యాపారం చేస్తారనుకోలేదు. మా పూర్వీకుడి ఆత్మ ఘోషిస్తూంటే దాన్ని కూడా మీరు ప్రజలకు వినోదంగా మార్చారు. రోజంతా పదే పదే జాగ్రత్త అంటే హెచ్చరించడానికి అన్నమయ్య ఆత్మ ఎంత చిరాకుపడుతుందో గ్రహించలేక పోయారా?" అంటూ చిరాకు పడ్డాడు.

కాంతయ్య నవ్వి, "అయ్యా! తమరి వద్ద దాచ డానికేముంది? మీ యింటి యినప్పెట్టెలోపల అన్నమయ్య రచించిన శతకం తాలూకు తాళ పత్రాలూ, గంటమూ తప్ప మరేమీ లేవు. తర తరాలుగా వాడకపోవడంవల్ల ఇనప్పెట్టె తలుపు తీస్తే వచ్చే శబ్దం "జాగ్రత్త" అన్న హెచ్చరికలా వినిపిస్తోంది. కాస్త నూనె పోస్తే ఆ శబ్దం ఆగిపోతుంది. ఇదంతా నేనెప్పుడో అర్థం చేసుకున్నాను కానీ ఆ యింటి నిండా అపూర్వ వస్తువులు నింపాలంటే ఆ యింటికి పేరు రావాలి. అందులో తమ అపూర్వ వస్తువులుంచాలని జనం కుతూహలపడాలి. అందుకని ఆ ప్రచారాన్నలాగే కొనసాగనిచ్చాను. తలుపు తెరిస్తే జాగ్రత్త అనివచ్చే అపూర్వ విశేషాన్ని నూనె పోసి ఆపడమెందుకు! అదలాగుంచితే ఆ యింటిమీద వచ్చే ఆదాయంలో ఒక్క పైస కూడా నేను స్వంతానికి తీసుకోవడంలేదు. ఎక్కడెక్కడికో వెళ్ళి అపూర్వ వస్తువులు కొంటున్నాను. కొంత కాలంలోనే ఆ యిల్లోక అపూర్వమైన అపూర్వవస్తు ప్రదర్శన శాల కాగలదు" అన్నాడు.

ఈ మాటలకు రామనాథ కవి తృప్తి పడ్డాడు.

కొంత కాలానికి కట్టుంగలోని అపూర్వ వస్తువుల ప్రదర్శనశాల అలనాటి అన్నమయ్యకీ ఆనాటి కాంతయ్యకీ ఎంతో పేరు తెచ్చిపెట్టింది.



# యద్భావం తద్భవతి

ఒక ఊళ్ళో ధనిక దంపతులు ఉండేవారు. భర్త పిసినారి, భార్యకి ఎప్పటి నుంచో కాశీ వెళ్లాలనీ, గంగలో స్నానం చేసి తరించాలనీ కోరిక. తన కోరిక భర్తకి ఎన్నోసార్లు చెప్పింది. అతను వాయిదాల మీద, వాయిదాలు వేస్తూ చివరికి దగ్గర వాళ్ళు వెళ్ళుతుంటే వారితో పంపుతానన్నాడు. కానీ ఆమె సరిగంగ స్నానాలు చేస్తేనే పుణ్యమనీ, ఒక్కర్తి వెళ్ళననీ మొండికేసింది.

చివరికి తప్పనిసరై ఇద్దరూ బయలుదేరి కాశీ చేరుకున్నారు. రానూపోనూ దారి ఖర్చులు, గంగ వడ్డున పూజలు ఇలా అనేక ఇతర ఖర్చులూ కలిపితే తడిసి మోపెడయేసరికి ధనికుడికి ఎక్కడిలేని చిరాకు వచ్చి మన ఊరి కాలువ నీళ్ళకీ, ఈ నీళ్ళకీ ఏమిటీ తేడారుఖు అవీ నీళ్ళే ఇవీ నీళ్ళే కదా! ఈ స్నానమేదో ఇక్కడే చేస్తే ఇంత ఖర్చు కలిసి వచ్చేది కదా" అని భార్యను మనసులో తిట్టుకున్నాడు. కార్యక్రమాలు అన్నీ ముగిసిన తరువాత భార్య పోరుతో గంగలో పడవ షికారుకు వెళ్లగా ప్రమాద వశాత్తు పడవ మునిగి ఇద్దరూ చనిపోయారు. భార్యని తీసికెళ్ళటానికి విష్ణుభటులు భర్తని తీసికెళ్ళటానికి యమభటులు వచ్చారు. కారణం అడిగిన భర్తకు గంగా స్నాన ఫలితంవలన ఆమె పాపాలన్నీ పోయి వైకుంఠ ప్రాప్తి కలిగిందని వారు తెలుపగా అతడికి కోపం వచ్చింది. తను కూడా గంగా స్నానం చేశానని వాదించాడు. అందుకు విష్ణుభటులు "యద్భావం తద్భవతి" అని వినలేదా? నువ్వు గంగలో చేసినా, అవి కాలువ నీళ్ళకంటే గొప్పవి కాదనుకున్నావు. ఇక నీకు గంగా స్నాన ఫలితం ఎలా వస్తుంది? ఆమె మాత్రం గంగలో మునిగి తనకి పాప ప్రక్షాళన అయిందని మనసారా నమ్మింది. అందువలన ఆమె పాపాలు నశించాయి" అని ధనికుని భార్యను మాత్రం పుష్పకం ఎక్కించుకుని వెళ్ళిపోయారు.

ఆకెళ్ల వెంకట సుబ్బలక్ష్మి





# ప్రళయబంధం

(ద్వితీయుడు భూగృహంలోని అందగత్తెను కలుసుకుని కొంతకాలం హాయిగా గడిపాడు. అది తెలిసిన భూతం ద్వితీయుడి కళ్ళ ముందే అందగత్తెను చిత్ర వధ చేసి చంపింది. ద్వితీయుణ్ణి కోతిగా మార్చింది. ఆ కోతి సముద్రపు ఒడ్డు చేరుకుని ఓ ఓడలోకి దూకితే ఓడలోని మనుషులు చీదరించుకుని పొడిచి చంపాలనుకున్నారు. ఆ తర్వాత....)

## 12

ఒకడు కత్తితో కోతిమీదకు వచ్చాడు. కోతి చప్పున ఆ కత్తిని లాక్కుని తనను రక్షించమన్నట్లు జాలి చూపులు చూస్తూండగా దాని కళ్ళ నుండి బొట బొటా దుఃఖాశ్రువులు రాలాయి.

ఓడ కప్తాను ఆ దృశ్యం చూసి చలించిపోయాడు. ఆయన మిగతా వారితో, "ఈ కోతి నాశరణు కోరింది. మీరెవ్వరూ దీని జోలికి వెళ్ళి బాధించకండి" అని హుకుం జారీ చేసి దాన్ని దగ్గరగా పిలిచి మంచి మాటలు చెప్పాడు. అన్నీ అర్థమైనట్లు అది తలూపుతూంటే ఆయన దాన్ని తన సేవలకు నియోగించాడు.. అది ఎంతో బుద్ధిగా కప్తాన్ని సేవించుకుంటూ ఆయన అభిమానాన్ని చూరగొంది.

గాలి అనుకూలంగా ఉండడంవల్ల అలా యాభై రోజుల ప్రయాణం అయ్యాక ఆ ఓడ ఒక పెద్ద పట్టణ తీరానికి చేరుకుంది.

ఆ ఊరి రాజు ఓడలోని వర్తకులకు స్వాగతం పలుకుతూ కొందరు రాజోద్యోగులను పంపాడు. వారు తమవెంట తినుబండారాలు, విలువైన కానుకలు మాత్రమే కాక ఒక పెద్ద కాగితపు చుట్టను కూడా తెచ్చారు.

విషయమేమిటంటే ఆ ఊరి వజీరు గొప్ప వ్రాయసకాడు. ఈ మధ్యనే ఆ వజీరు మరణించాడు. అంత గొప్పగా వ్రాయగల వాడి కోసం రాజు అన్వేషిస్తున్నాడు. రాజోద్యోగులా విషయం చెప్పారు.

అంతలో కోతి కాగితం చుట్టను అందుకుంది. అది ఆ చుట్టను నీటిలో పారేస్తుందని మిగతా వారు భయపడ్డారు కానీ కప్తాను దాని సైగలను అర్థం చేసుకున్నాడు. అది తనూ వ్రాస్తానని అంటున్నది.

అనుసరణ: మనోహర్



మీద ఎక్కించి మేళతాళాలతో నా వద్దకు తీసుకురండి" అని చెప్పాడు.

ఈ మాటలు వింటూనే ఉద్యోగులు పక పకా నవ్వారు. రాజుకు కోపం వచ్చి కారణమడిగాడు. ఆ పద్యాలు ఒక కోతి వ్రాసిందని తెలుసుకున్నాక ఆయన, "ఒక కోతి ఇంత బాగా వ్రాస్తే ఆశ్చర్యం కలగాలి. మీకు నవ్వేలా వచ్చింది? మనుషుల్లోనే ఇంత తెలివి ఉండదు. ఆ కోతి మనుషుల కంటే గొప్పది. వెంటనే దాన్ని నేను చెప్పిన విధంగా సగౌరవంగా నా ముందుకు తీసుకుని రండి" అని చెప్పాడు తన అనుచరులకు.

రాజోద్యోగులు కప్తాను వద్దకు వెళ్ళి రాజాజ్ఞ తెలియజేశారు. కప్తాను రాజాజ్ఞను కాదనలేక అయిష్టంగానే అందుకు ఒప్పుకున్నాడు. కోతి కూడా కన్నీళ్ళతో ఆయనకు వీడ్కోలు చెప్పింది.

కోతి గురించి కప్తానుకు చాలా ధనం ముట్టింది. రాజోద్యోగులు కోతిని రాజు కోరిన విధంగా అలంకరించి కంచరగాడిదపై ఎక్కించి తప్పెట్లు, తాళాలతో తీసుకుని వెడుతూంటే నగర వాసులందరూ అమితాశ్చర్యంతో చూశారు.

రాజు వద్దకు వెళ్ళాక కోతి మనిషిలాగే ఆయనకు అభివాదం చేసింది. రాజు అది చూసి ఎంతో ముచ్చటపడి దానికి ఉచితాసనం చూపించాడు. కోతి వినయంగా ఆసనంపై కూర్చున్నాక ఆయన తనకు ప్రియపాత్రుడైన ఓ బానిసను మాత్రం దగ్గరుంచుకుని మిగతా అనుచరుల నక్కణ్ణించి వెళ్ళిపొమ్మన్నాడు. తర్వాత ఆయన కోతికి విందు భోజనం తెప్పించి పెట్టాడు. కోతి మనుషుల కంటే చక్కగా

అప్పటికే కప్తానుకాకోతిపై సదభిప్రాయం ఏర్పడి ఉండడంవల్ల ఆయన దానికి కలం, సిరాబుడ్డి ఇప్పించాడు.

కోతి ఎంతో చక్కగా నాలుగు పద్యాలు రాసిందా కాగితంమీద. నాలుగు పద్యాలూ నాలుగు తరహాల్లో ఉండి ఎంతో బాగున్నాయి. అందరూ దాని ప్రతిభకు ఎంతో ఆశ్చర్యపోయారు. ఆ తర్వాత మిగతా వాళ్ళు కూడా ఆ కాగితం మీద తమకు తోచినవి వ్రాసి ఇచ్చారు. రాజోద్యోగులా కాగితాలు తీసుకుని వెళ్ళి రాజుకు చూపించారు.

రాజుకు కోతి వ్రాసిన పద్యాలు అమితంగా నచ్చాయి. ఆయన తనవారితో, "ఈ వ్రాత ఎవరిదో వారిని వెంటనే మేలు దుస్తులు కట్టబెట్టి, విలువైన ఆభరణాలతో అలంకరించి, చక్కని కంచరగాడిద

మసలుతూ ఎంతో శుభ్రంగా భోజనం చేసింది. చేతులు కడుక్కుంది. శుభ్రంగా తువ్వాలుతో తుడుచుకుంది. అప్పుడది కలం తీసుకుని సిరాబుడ్డిలో ముంచి ఓ కాగితం మీద మూడు పద్యాలు వ్రాసింది.

రాజా పద్యాలు చదివాడు. రాజిచ్చిన విందు భోజనంలోని తినుబండారాలను పొగుడుతూ వ్రాసిన పద్యాలవి. ఒక కోతికి యింత ప్రతిభ ఎలా వచ్చిందా అని ఆశ్చర్యపడుతూనే, "అయినా అల్లామాయలు నా వంటి సామాన్యుడికి అర్థం కావులే-" అంటూ సరిపెట్టుకుని, "నువ్వు చదరంగం కూడా ఆడగలవా?" అనడిగాడు కోతిని.

కోతి ఆడగలనన్నట్లు తలూపింది. రాజు వెంటనే చదరంగం బల్ల, పావులు తెప్పించి- బల్ల కటూ యిటూ ఆసనాలు అమిరించాడు. కోతి రాజుకు ఎదురుగా కూర్చుంది. పావులను బల్లమీద సరైన పద్ధతిలో పేర్చింది. ఆట మొదలయ్యాక వరుసగా రెండాటల్లో రాజును ఓడించింది.

"ఇదే కనుక మనిషై ఉంటే - మనుషుల్లో కల్లా తెలివైనదై ఉండేది. ఈ కోతిని నా గారాల కూతురుకు చూపించి తీరాలి" అనుకుని తన ప్రియపాత్రుడైన బానిసను పంపాడు. కొద్ది క్షణాల్లోనే రాజు కూతురు అక్కడకు వచ్చి చటుక్కున మేలి ముసుగును ముఖం మీదకు లాక్కుని, "నాన్నా! అపరిచితులిక్కడున్న విషయం నాకు ముందే చెప్పవద్దూ!" అన్నది.

"ఇక్కడ అపరిచితులెవరున్నారు? నేనేమో నీ తండ్రిని. ఈ బానిస నిన్ను చిన్నప్పట్నించీ తండ్రిలా పెంచాడు. ఇక మిగిలిందీ కోతి- నువ్వు ముసుగు తొలగించవచ్చును" అన్నాడు రాజు నవ్వుతూ.





"అయ్యో- ఈ కోతి నిజంగా కోతి కాదు. ఒక రాజకుమారుడు. ఇక్కడికి ఎంతో దూరంలో ఉన్న దేశానికి రాజైన ఇఫ్తామారూస్ ప్రభువు ఇతడి తండ్రి. జార్జిస్ అనే దుష్టభూతం ఇతణ్ణిలా కోతిగా మార్చింది. ఈ యువరాజు మామూలు మనిషి కాదు. విద్యాధికుడు, జ్ఞాని, వివేకవంతుడూనూ-" అంది రాజకుమార్తె.

"ఇది నిజమా?" అన్నాడు రాజు ఆశ్చర్యంగా కోతి వంకే చూస్తూ.

కోతి తలూపింది. ఆ వెనువెంటనే దానికి దుఃఖం వచ్చింది. అది భోరున ఏడ్వడం ప్రారంభించే సరికి రాజు అప్రతిభుడయ్యాడు. ఆయన తన కూతురి వంక తిరిగి, "ఇదంతా నీకెలా తెలిసింది?" అనడిగాడు.

"నా చిన్నప్పుడు మా యింట్లో ఓ ముసలిది ఉండేది. దానికి తెలియని మాయలూ, మంత్రాలూ లేవు. అది నాకు తన విద్యలు నేర్పింది. ఆ తర్వాత నేను మంత్ర విద్యను మరింత లోతుగా అధ్యయనం చేశాను. ఇప్పుడు నాకు సుమారు నూటడెబ్భై మంత్రాలు తెలుసును. నేను తలచుకుంటే ఇప్పుడు మన నగరాన్ని పునాదులతో సహా పెకలించి కాఫ్ పర్వతం అవతలవైపు ఉంచగలను. మన నగరాన్ని నీటిలో ముంచి నగరవాసులను అందులో చేపలుగా మార్చగలను-" అంది రాజకుమారి.

తన కూతురిలో అన్ని శక్తులున్నాయని అంతకాలం తనకు తెలియనందుకు రాజు నివ్వెరపోయాడు. వెంటనే ఆ కోతిని మనిషిగా మార్చమని కూతుర్ని అర్థించాడు. అంత తెలివైన వాడికి కోతి రూపు తగదనీ, అతడు మనిషిగా మారితే తనకు వజీరుగా చేసుకుంటాననీ ఆయన అన్నాడు.

రాజకుమారి సరేనంది.

కథ ఇంతవరకూ చెప్పాక అప్పుడే తెల్లవార వస్తోంది. షారాజాద్ అప్పటికి కథను ఆపి మళ్ళీ ఆ రాత్రికి తిరిగి వచ్చింది. కథను ప్రారంభించింది.

## పదునాల్గవ రాత్రి కథ:

ద్వితీయుడు అక్కకు తన కథనిలా కొనసాగించాడు.

రాజకుమారి ఒక కత్తిని తీసుకుంది. దానిమీద హీబ్రూ భాషలో బీజాక్షరాలు వ్రాయబడి ఉన్నాయి. ఆమె భవనం మధ్యలోనికి వెళ్ళి ఆ కత్తితో ఓ సున్నాని గీసి దాంట్లో మంత్ర కవచానికి సంబంధించిన పేర్లు రాసింది. తర్వాత తను ఆ సున్నాలో నిలబడి ఏవో

మంత్రాలు చదవసాగింది. కొద్ది నిముషాల్లోనే ఆ భవనం చీకటిమయమైంది. అందులోంచీ జార్జిస్ ఉద్భవించాడు. వాడి చేతులు సూదుల చెంచాల్లా ఉన్నాయి. కాళ్ళు గదల్లా ఉన్నాయి. కళ్ళు మండే నిప్పుకణికెల్లా ఉన్నాయి. వాడి భయంకర రూపానికి రాజకుమారి తప్ప మిగతా వారందరూ గజ గజ వణికేరు.

రాజకుమారి వాడిని చూస్తూనే, "నేను నీకు స్వాగతం పలకడం లేదు" అంది.

జార్జిస్ ఆమె వంక గ్రుడ్లురిమి చూస్తూ, "ఓసి విశ్వాస ఘాతకురాలా! మనం మన శక్తులను ఒకరి మీద ఒకరు ప్రయోగించకూడదన్న మాట తప్పావు కదే! నీకు కాలం మూడింది" అంటూ తానొక సింహంగా మారి ఆమె పైకి దుమికాడు.

నోరు తెరిచి మీద పడబోతున్న ఆ సింహాన్ని చూసి రాజకుమారి ఏ మాత్రమూ చలించక తన తలవెంట్రుకనొకటి పెరికి మంత్రించి దానిమీదకు విడిచింది. ఆ వెంట్రుక కత్తిగా మారి ఆ సింహాన్ని రెండు ముక్కలుగా ఖండించింది. ఆ వెంటనే సింహం తల తేలుగా మారింది. అది తన మీదకు వచ్చేలోగా రాజకుమారి మహా సర్పంగా మారింది. ఆమెను తప్పించుకునేందుకు తేలు రాబందుగా మారితే సర్పం డేగ అయింది. ఓ గంటసేపు వాటి మధ్య ఘోర యుద్ధం జరిగేక రాబందు నల్లపిల్లి గానూ, డేగ తోడేలుగానూ మారిపోయారు. కాసేపు పోరాటం సలిపేక నల్లపిల్లికి ప్రాణాపాయదశ వచ్చింది. అప్పుడది ఒక పెద్ద దానిమ్మ పండుగా మారింది. తోడేలు దాన్ని పట్టబోగా అది గాలిలోకి ఎగిరింది. అయితే అది ఎంతోసేపు గాలిలో ఉండలేక బరువుకు దబ్బున నేలమీద పడింది.





ముక్కలైన దానిమ్మ పండునించి ఒకటొక్కటిగా నేల రాలిన ఎర్రని గింజలు క్రమంగా నేలంతా పరుచుకున్నాయి. అప్పుడు తోడేలు కోడిపెట్టగా మారి ఒకో గింజనే ఏరుకుని తినడం మొదలు పెట్టింది.

కాసేపటికి ఒక్కటి తప్ప అన్ని గింజలూ అయిపోయాయి. కోడిపెట్ట ఆఖరి గింజను ముక్కున కరచుకుంది. కానీ విధి విలాసం ఎవరికి తెలుస్తుంది? ఆ గింజ దాని ముక్కునించి జారి నేల మీద పడింది. అంతే! పెద్ద చప్పుడుతో అక్కడి నేల బీట గీసి ఆ గింజ కనపడకుండా పోయింది.

అప్పుడు కోడి పెద్దగా అరిచింది. ముక్కుతో అక్కడున్న వారికి ఏవేవో సైగలు చేస్తూ రెక్కలు టపటపా కొట్టుకుంది. ఆ చప్పుడుకా భవనం కూలి తమపై పడదు కదా అని అక్కడున్న వారందరికీ భయం వేసింది. కోడి మాత్రం మిగిలిన ఒక దానిమ్మ గింజ కోసం బీటలో అన్వేషిస్తూనే ఉంది. చివరికి దానికా గింజ దొరికినట్లే దొరికి మళ్ళీ ముక్కు నుంచి రాలి క్రింద పడిపోయింది. ఈసారి అది అక్కడున్న కొలను నీటిలో పడి చేపగా మారి ఈదుకుంటూ అడుక్కు వెళ్ళిపోయింది.

అప్పుడు కోడి పెద్ద తిమింగలంగా మారి నీటిలోకి దూకి అడుక్కు వెళ్ళిపోయింది. ఆ తర్వాత కొంతసేపు అక్కడున్న వారికి ఆ రెండూ ఏమయ్యాయో తెలియలేదు. కానీ కాసేపటికి ఎవరో ప్రాణభయంతో పెట్టిన కేకలు వినిపించి రాజు, కోతి, బానిస గజగజ వణికి పోయారు.

అంతలో నీటిలోంచీ జార్జిస్ తన నిజరూపంతో వచ్చాడు. వాడు నిప్పు కణికలా మండిపోతున్నాడు. వాడి కళ్ళలోంచీ, ముక్కులోంచీ, నోట్లోంచీ ఆగకుండా పొగలు వస్తున్నాయి. వాడి వెనుకనే రాజకుమారీ నిజరూపంతో వచ్చింది. ఆమె చుట్టూ మంటలున్నాయి. కరిగిపోతున్న బంగారంలా ఉన్న ఆమె జార్జిస్‌ను తరిమింది.

జార్జిస్ పరుగెడుతూ వచ్చి నోట్లోంచీ మంటలను సృష్టించి అక్కడున్న ముగ్గురి మీదా ఊదాడు. రాజకుమారి కూడా మంటలను సృష్టించి వాడి మీదకు ఊదింది. ఆ మంటల్లో కొన్ని అక్కడున్న వారిని తాకాయి. రాజకుమారి సృష్టించిన మంటలవల్ల వాళ్ళకు ఏ హానీ జరుగలేదు. కానీ జార్జిస్ వదిలిన నిప్పురవ్వల్లో ఒకటి కోతి ఎడమ కంటిని కాల్చేసింది. మరో నిప్పురవ్వ రాజు గెడ్డాన్ని తాకింది. ఆయన గెడ్డం పూర్తిగా కాలిపోయింది.

క్రింది పళ్ళన్నీ ఊడిపోయాయి. మూడో నిప్పురవ్వ భానిస ఛాతీని తాకింది. వాడు వెంటనే నిలువునా భస్మమైపోయాడు.

ఇక్కడిలా జరుగుతూండగానే రాజకుమారి జూర్జిస్ మీదకు మంటలు వదుల్తూనే ఉంది. కాసేపటికి వాడు బొగ్గులా మారి నేలకూల్చాడు. అప్పుడు రాజకుమారి ఉన్నట్లుండి, "అల్లా మాత్రమే గొప్పవాడు. అల్లా మాత్రమే బలవంతుడు. నీ వంటి భ్రష్టులనాయన సర్వనాశనం చేస్తాడు" అంటూ రాజు వద్దకు వచ్చి కాసిని నీళ్ళు కావాలని అడిగి తెప్పించుకుని చేతిలో పోసుకుని ఏవో మంత్రాలు ఉచ్ఛరించింది. తర్వాత నీళ్ళను కోతిమీద చల్లి, "సత్యమూ, నిత్యమూ, శక్తిమంతమూ అయిన అల్లా నామం నీకు యధారూపం ప్రసాదించుగాక!" అంది.

అప్పుడు కోతి ద్వితీయుడిగా మారిపోయింది. కానీ పోయిన కన్ను మాత్రం తిరిగి రాలేదు. రాజకుమారి ద్వితీయుణ్ణీ, తండ్రినీ జాలిగా చూసి, "జూర్జిస్ చేసిన తప్పును సవరించగలను కానీ నిప్పు చేసిన తప్పు సవరించలేను. నేను మీకు చేయగలిగిన సాయం ఇంతే! ఇక నా పని కూడా అయిపోయింది. ఈ జూర్జిస్ మనిషై ఉంటే ఒక్క దెబ్బతో చంపగలిగి ఉండే దాన్ని. పోనీ వాడు దానిమ్మ పండుగా మారి పగిలినప్పుడైనా అన్ని గింజలూ మింగేసి ఉంటే వాడు అంతమై పోయేవాడు. మిగిలిన ఆ ఒక్క గింజలో వాడి ఆత్మ దాక్కుంది. ఆ గింజ నాకందకుండా పోవడంతో మేమిద్దరం పెద్ద యుద్ధం చెయ్యక తప్పలేదు. గాలిలో, నీటిలో, భూమి అడుగునా మేమిద్దరం భీకరంగా పోరాడాం. తప్పించుకుందుకు వాడు చేసే ప్రతి ప్రయత్నమూ నన్ను ప్రమాదానికి గురి చేసింది.



చివరకు వాడు అగ్ని ప్రయోగం చేశాడు. అప్పుడిక ఇద్దరమూ నాశనం కాక తప్పదు. అదృష్టం కొద్దీ నేను మండి బూడిద అయ్యేలోగానే వాడిని నాశనం చేయగలిగాను" అంది. అంతలోనే ఆమె శరీరం భగ్గున మండింది. అప్పుడామె, "అల్లా తప్ప దైవం లేదు. మహమ్మద్ ఆయన దూత అందుకు నేనే సాక్షిని" అంటూ కాలి బూడిదైపోయింది.

రాజు దుఃఖంతో భోరున ఏడ్చాడు. ఆయన తన కూతురు అంత్యక్రియలు వైభవంగా జరిపించాడు. ఆమెకు సమాధి కట్టించాడు. జూర్జిస్ చితాభస్మం మాత్రం ఏ సంస్కారమూ లేకుండా గాలిలో కలిసిపోయింది.

రాజు మామూలు మనిషి కావడానికి నెల రోజులు పట్టింది. అప్పుడాయన ద్వితీయుణ్ణి పిలిచి, "నువ్వు ఇక్కడ అడుగుపెట్టేదాకా మేము సుఖశాంతులతో జీవించాము. అపశకుని పక్షిలా నువ్విక్కడకు వచ్చావు. నాకూతురుపోయింది. నా కూతుర్ని పెంచి పెద్ద చేసిన బానినపోయాడు. నా ముఖం కాలిపోయింది. వీటన్నింటికీ నిన్ను తప్పుపట్టను. ఎందుకంటే ఏమి జరిగినా అంతా అల్లా ఆదేశం ఇప్పుడా అల్లాయే నాకు నీ మీద ద్వేషం పుట్టిస్తున్నాడు. నేను నీ మీద ఆగ్రహంతో నీకు అపకారం తలపెట్టేలోగా నువ్విక్కణ్ణించి దూరంగా ఎక్కడికైనా వెళ్ళిపోయి ప్రశాంతంగా జీవించు" అని చెప్పాడు.

ఆయన తనను అంతటితో వదిలి పెట్టినందుకు ద్వితీయుడెంతో సంతోషించాడు. అతడు ఊళ్ళోకి వెళ్ళి గెడ్డం గీయించుకుని ఆ నగరం విడిచిపెట్టాడు. మనసులో అల్లానే తలచుకుంటూ, "జీవితం కంటే కన్ను ముఖ్యం కాదు. అంతా నీ దయ" అని ఆయన్ని పొగుడుకుంటూ బాగ్దాదు నగరం చేరి అక్కడ అనుకోకుండా తనలాగే ఉన్న మరి యిద్దరు కలాందారులను కలుసుకున్నాడు.

"ఆ తర్వాత ఏం జరిగిందో మీ అందరికీ తెలుసు" అంటూ ద్వితీయుడు తన కథను ముగించాడు.... (ఇంకా ఉంది)



# పొట్టివాడి తెలివి

- మాకోజు సులోచన

ఒక ఊళ్ళో ఓ పొట్టివాడూ, పొడుగు వాడూ ఉన్నారు. పొట్టివాడు పేదవాడు. పొడుగువాడు కలిగినవాడు.

ప్రతిరోజూ పొడుగువాడు పొట్టివాణ్ణి గేలి చేసేవాడు. చాలాకాలం సహించేక ఒకరోజున, "నేను పొట్టి అయితేనేం నాకు వుట్టెడు బుద్ధులున్నాయి. చిన్న మూతికుండలో పెద్ద గుమ్మడి కాయ నుంచగలను నేను. నీకా తెలివి ఏదీ?" అన్నాడు పొట్టివాడు.

పొడుగువాడు వెంటనే ఓ చిన్న మూతి కుండను పొట్టివాడికిచ్చి, "ఇందులో పెద్ద గుమ్మడికాయ ఉంచి నా దగ్గరకు తీసుకురా. వెయ్యి వరహాలిస్తాను. తీసుకు రాలేవూ- బ్రతికున్నంతకాలం నాకు ఊడిగం చెయ్యి" అన్నాడు.

"అలాగే చేస్తాను. అందుకు నెల రోజులు పడుతుంది. సరేనా?" అన్నాడు పొట్టివాడు. పొడుగువాడు తలూపి వెళ్ళిపోయాడు.

పొట్టివాడు కుండను గుమ్మడి పాదు వద్దకు తీసుకుని వెళ్ళి నెలరోజుల పిందెను కుండలో ఉంచాడు. మరో నెలరోజుల్లో పిందె పెద్దదయింది. వాడు కాయను ముచిక దాకా కోసి కాయ ఉన్న కుండను పొడుగువాడి వద్దకు తీసుకుని వెళ్ళాడు.

అంత పెద్ద కాయను కుండలో ఉంచడానికి వాడేం చేశాడో తెలిసేక పొడుగు



వాడు వెయ్యి వరహాలూ ఇచ్చుకోవడమే కాక పొట్టివాడి తెలివిని మెచ్చుకుని అప్పట్నించీ వాణ్ణి గేలి చేయడం మానుకున్నాడు.



# నీతి - సలహా

లక్ష్మీపురం అనే గ్రామంలో రాము, రాజు అనే ఇద్దరు మిత్రులున్నారు. వాళ్ళు కష్టపడి పనిచేసి వచ్చిన దానితో తృప్తిగా జీవించేవారు. ఇద్దరికీ పెళ్ళిళ్ళయ్యాయి. ఇద్దరి భార్యలకూ ధనాశ ఎక్కువ. ఎక్కడికైనా వెళ్ళి బోలెడు డబ్బు సంపాదించుకుని రమ్మని వాళ్ళు భర్తలను పోరుతూండేవారు.

ఎవరైనా ఇంటిపోరును ఎంతకాలం సహించగలరు? ఒకరోజున రాము, రాజు ధనార్జన నిమిత్తం ఇల్లు విడిచి పెట్టారు. ఎంతో దూరం ప్రయాణం చేసి ఒక ఊరు చేరుకుని ఒక సత్రంలో బస చేశారు. చీకటి పడేవేళకు ఎవరో అనుకున్న మాటలు వారి చెవిలో పడ్డాయి. ఏనుగుల పల్లి జమీందారు పనివాళ్ళకు బాగా ఎక్కువ జీతా లిస్తాడట. ఆయనకిప్పుడు ఇద్దరు జీతగాళ్ళు కావాలిట. తెల్లవారగానే లేచి అక్కడికే వెళ్ళాలని ఓ యిద్దరనుకుంటున్నారు.

రాము, రాజు ఆ పని తామే సంపాదించాలనుకుని అప్పటికప్పుడు ఏనుగుల పల్లి బయల్దేరారు. తెల్లవారేసరికి వారా ఊరు చేరుకుని ఓ పూట కూళ్ళవ్వ యింట్లో బస చేశారు. అవ్వ వారిని బాగా ఆదరించి వచ్చిన పని తెలుసుకుని, "బాబులూ! మీరు చూడబోతే అమాయకుల్లా ఉన్నారు. ఈ ఊరి జమీందారు జీత మెక్కు విచ్చే మాట నిజమే కానీ ఆయన పరమ దుర్మార్గుడు. ఆయన పెట్టే హింసలకు మీరు తట్టుకోలేరు. కాబట్టి రంగన్న పల్లి వెళ్ళండి. ఆ ఊళ్ళో ఎక్కడ తవ్వినా బంగారం దొరుకుతుంది" అని చెప్పింది.

ఈ వార్తకు మిత్రులిద్దరూ బ్రహ్మానంద పడి పోయారు. కష్టపడి పనిచేయకుండా బంగారం దొరుకుతుందంటే ఎవరికి సంతోషంగా ఉండదు?

సాయంత్రానికల్లా రాము, రాజు రంగన్న పల్లి చేరుకున్నారు.

రంగన్న పల్లిలో కొన్నేళ్ళుగా వానలులేక పంటలు సరిగ్గా పండడం లేదు. ఊరి ప్రజలందరూ దరిద్రంతో బాధపడుతున్నారు. వాళ్ళు రాము, రాజుల మాటలు విని, "మా భూమిలో మొక్కే మొలవక మేమేడు

కడకట్ల లక్ష్మీపద్మజ

స్తుంటే అందులో బంగారమా? మీకేమైనా వేళా కోళంగా ఉందా?" అంటూ నానా తిట్లూ తిట్టారు.

అయినా రాము, రాజు ఎవరూ చూడకుండా ఒకటి రెండు చోట్ల తవ్వి చూశారు. చిల్లపెంకులూ, కంకరరాళ్ళూ తప్ప రాగికాసు కూడా వారికి దొరకలేదు. హతాశులై ఆ ఊరు విడిచి పెట్టగా పొలిమేరలో వారికో పెద్ద మర్రి చెట్టు కనిపించింది.

మిత్రులిద్దరికీ బాగా నిద్ర వస్తోంది. నిద్రపోతే వారి దగ్గరున్న కాసిని డబ్బులూ ఏ దొంగలైనా వచ్చి కాజేస్తారని వారి భయం. అందుకని తమ డబ్బు మూటను మర్రి చెట్టుతొర్రలో దాచాలనుకుని అందులో చెయ్యిపెట్టేసరికి అందులో అప్పటికే ఉన్న కొన్ని మూటలు వారి చేతులకు తగిలాయి. వాళ్ళా మూటలను బయటకు తీసి చూసి తమ కళ్ళను తామే నమ్మలేక పోయారు.

ఆ మూటలనిండా కళ్ళు జిగేల్మనిపించే బంగారు కాసులు, నగలు, రత్నాలు, వజ్రాలు!

ఎవరో దొంగలు తాము దోచిన సొత్తును అక్కడ దాచుకుని ఉంటారు. అదృష్టం కొద్దీ ఆ సొమ్ము తమకంట బడిందనుకుంటూ మిత్రులిద్దరూ వెంటనే ఇంటికి ప్రయాణం కట్టారు. ఇల్లు చేరుకున్నాక జరిగింది భార్యలకు చెప్పారు.

ఆ డబ్బుతో వాళ్ళు మేడలు కట్టారు. పొలాలు కొన్నారు. సంతోషంగా రోజులు గడుపుతున్నారు.

అలా రెండేళ్ళు గడిచాయి. రాము, రాజుల భార్యలకు ఉన్న డబ్బు చాల దనిపించింది. మళ్ళీ వెళ్ళి ఇంకా డబ్బు సంపాదించుకుని రమ్మని వాళ్ళు భర్తలను అదేపనిగా పోరసాగారు. చివరకొక రోజున



రాము, రాజు మళ్ళీ ధనార్జనకు బయల్దేరి ఒక ఊరు చేరి ఒక సత్రంలో బస చేసి రాత్రికాగానే నిద్ర పోయారు.

ఆ రాత్రి సత్రంలో దొంగలు పడి బాటసారు లందర్నీ నిలువునా దోచుకున్నారు. అక్కడున్న వారందర్నీ కట్టేశారు కానీ దొంగల రాకతో భయపడి తెలివిగా మూలకు నక్కిన రాము, రాజులను మాత్రం వాళ్ళు గమనించలేదు.

అక్కణ్ణించి వెళ్ళిపోతూన్న దొంగలను మిత్రులిద్దరూ రహస్యంగా అనుసరించారు. దొంగలు ఒక శ్మశానం చేరుకుని తాము తెచ్చిన డబ్బునంతా ఒక సమాధిలో పాతిపెట్టి అక్కణ్ణించి వెళ్ళిపోవడం చూశారు. దొంగలు దరిదాపుల్లో లేరని రూఢి అయ్యేక వాళ్ళా సమాధి చెంతకు చేరి దొంగ



సొమ్మును తవ్వి తీసుకుని ఇంటికి వెళ్ళారు. భార్యలు వాళ్ళను ఎంతో ప్రేమగా ఆదరించారు. అలా రెండేళ్ళు గడిచేక భార్యల్లో మరింత ధనాశ పెరిగి పోవడంతో మళ్ళీ భర్తలను వేధించసాగారు. భర్తలు కాదంటే వాళ్ళు ఆత్మహత్య చేసుకుంటామని బెదిరించారు.

రాము, రాజులకు మళ్ళీ ప్రయాణం కట్టక తప్పలేదు. కొంత దూరం వెళ్ళేక వాళ్ళకు ఓ సన్యాసుల గుంపు ఎదురయింది. సన్యాసుల గురువు రాము, రాజులను చూసి, "మీరిద్దరూ మహా పాపులు. వెంటనే మీమీ పాపాల్ని కడిగేసుకోక పోతే ఈ లోకంలోనే నరకం అనుభవిస్తారు" అన్నాడు.

మిత్రులిద్దరూ హడలిపోయి గురుసన్యాసి కాళ్ళమీద పడి అంతవరకూ జరిగిన తమ కథను చెప్పారు.

"మీకు దొంగసొత్తు దొరికినపుడు దానిని రాజుకైనా అందజేయాలి. స్వంతదారుకైనా అందజేయాలి. అలా చేయక పోవడం వల్ల మీకు దొంగతనం చేసిన పాపం చుట్టుకుంది. వెంటనే ఇంటికి వెళ్ళి మీదగ్గరున్న దంతా రాజుకిచ్చేయండి. తిరిగి ఎప్పటికిలా జీవించండి" అని హితబోధ చేశాడు గురుసన్యాసి.

అప్పుడు మిత్రులిద్దరూ ఇళ్ళకు తిరిగివెళ్ళి భార్యలకు జరిగింది చెప్పారు. కానీ వాళ్ళ భార్యలకీ హితవు నచ్చలేదు.

"మిమ్మల్ని డబ్బు సంపాదించుకుని రమ్మని పంపితే వేదాంతం నేర్చుకుని వస్తారా? డబ్బు తెచ్చేదాకా మళ్ళీ కనపడకండి" అంటూ వాళ్ళు తమ భర్తలను ఇళ్ళలోంచి గెంటివేశారు.

రాము, రాజు ఏంచేయాలో తెలియక సన్యాసుల్లో కలిసి పోదామనుకున్నారు. సన్యాసుల గుంపును వెతుక్కుంటూ బయల్దేరిన వాళ్ళకు దారిలో ఇద్దరమ్మాయిలు ఎదురయ్యారు. వారిలో ఒకామె పేరు సీత. ఇంకొకామె రాణి.

సీత, రాణిల భర్తలు దురాశాపరులు. ఎంత సంపాదించినా తృప్తిలేక వాళ్ళు దుష్కార్యాలెన్నో చేస్తున్నారు. సీత, రాణి వాటిని సహించలేక భర్తలకు మంచి మాటలు చెబుతూండేవారు. వాళ్ళు వినేవాళ్ళు కాదు. విసిగిపోయిన సీత, రాణి భర్తలకు ఎదురు తిరిగారు. దాంతో భర్తలకు కోపం వచ్చి ఇంట్లోంచి గెంటేసి మళ్ళీ కనపడితే

ప్రాణాలు తీస్తామన్నారు. చేసేదిలేక సీత, రాణి ఇల్లు విడిచి వచ్చేశారు.

రాము, రాజు ఆశ్చర్యపడి, "మీ కథా మా కథ ఒక్కలాగే ఉంది" అంటూ తమ కథను చెప్పుకున్నారు.

అప్పుడు నలుగురూ కలిసి ఏం చేయాలా అని చాలాసేపు ఆలోచించారు. చివరకు పెద్దలెవరినైనా సలహా అడగాలనుకున్నారు.

అప్పుడే ఆదారిలో ఎవరో వృద్ధ దంపతులు వెడుతున్నారు. రాము, రాజు వాళ్లను ఆపి, "భార్యలు భర్తల్నీ, భర్తలు భార్యల్నీ వేధిస్తూంటే వాళ్ళు ఇళ్ళు విడిచి వేరే పెళ్ళిళ్ళు చేసుకోవచ్చా?" అనడిగారు.

వృద్ధ దంపతులిద్దరూ ఏకకంఠంతో, "అది మహా పాపం నాయనలారా! కాబట్టి ఎలాగో అలా వాళ్ళు కలిసే జీవించాలి" అన్నారు.

"అయ్యో మీకు సరిగ్గా అడగడం రాలేదు" అంటూ సీత, రాణి, "దురాశ, తృప్తి ఒక్కసారే ఎదురైతే మనిషి ఏం చేయాలి?" అనడిగారా దంపతుల్ని.

"తృప్తిని దగ్గరగా తీసుకుని దురాశకు దూరంగా వెళ్ళిపోవాలి" అన్నారా వృద్ధదంపతులు ఏక కంఠంతో.

ఆ దంపతులు వెళ్ళిపోయాక సీత, రాణి నవ్వుతూ, "పెద్దలను అడిగితే వారు చెప్పే నీతి ఒకలా ఉంటుంది. సలహా ఇంకొకలా ఉంటుంది. సలహాకంటె నీతి గొప్పది కాబట్టి మనం నీతినే పాటిద్దాం" అన్నారు.

ఆ నలుగురూ ఓ ఊరు చేరుకున్నారు. రాము సీతనూ, రాజు రాణినీ పెళ్ళి చేసుకుని అక్కడే స్థిరపడ్డారు. కష్టపడి జీవిస్తూ ఉన్నాదానితో తృప్తి పడుతూ కలకాలం హాయిగా జీవించారు.

అంతావాళ్ళను దురాశకు దూరంగా, తృప్తితో కలిసి జీవిస్తున్నారని చెప్పుకునేవారు. దురాశ అంటే తాము పూర్వం కట్టుకున్న వాళ్ళనీ, తృప్తి అంటే ఇప్పుడు కట్టుకున్న వాళ్ళనీ ఆ దంపతులు అనుకునేవారు.



## జూన్ నెల

# బొమ్మల సంభాషణ ఫలితాలు



భిక్షగాడు : అయ్యా! భిక్షమెయ్యండి బాబూ!

రాజకీయ నాయకుడు : నేనే భిక్షానికి వెళుతున్నాను. నీవు తట్టలో భిక్షమెయ్యమంటావు. నేను పార్టీ జెండానుపయోగించి ఓటు వెయ్యమని అడుకుంటున్నాను.

-దుర్గారావు, తణుకు

* * *

నాయకుడు : (ఆశ్రుతగా) "పోయినసారి ఎలక్షన్స్‌లో నాలాగా ఒకతను వచ్చాడు అతను నీకు తెలుసా?"

అడుకునేవాడు : "ఆ తెలుసు! వాడే నేను బాబూ!"

-డి.రమణి, బందరు

* * *

భిక్షగాడు : "భిక్షమెయ్యండి బాబూ!"

రాజకీయ నాయకుడు : ఇంట్లో ఉంటే బాకీవాళ్ళ గొడవ బయటకు వస్తే భిక్షగాళ్ళ గొడవ.. వెళ్ళు.. వెళ్ళు...

-శంకర్, పెన్న

* * *

రాజకీయ నాయకుడు : "ఎందుకురా అడుక్కుతింటావు?"

భిక్షగాడు : "ఎట్లాగూ మీకు నా గతి తప్పదు. అప్పుడు నేనే సీనియర్‌ని"

-యస్. సుబ్బారావు, సికింద్రాబాద్

* * *

భిక్షగాడు : "అయ్యా! నేను బాగా బతికినవాడినే బాబూ! ధర్మం వెయ్యండి బాబూ!"

రాజకీయ నాయకుడు : "నేనే సోమరిపోతుని తెలిసి ప్రజలు నన్ను నాయకుణ్ణి చేసారు. నేను ఎవరికి భిక్షమెయ్యమంటావ్"

-ఆర్. రంగారావు, రావులపాలెం

* * *

(పైన తెలిపిన ఐదుగురికి ఒక్కొక్కరికి 15 రూపాయల చొప్పున బహుమతిగా పంపగలము)

# ప్రశ్నలు - జవాబులు

**ప్రశ్న: గురక పెట్టడం ఒక జబ్బా?**

జవాబు: నోటిలోపల వెనుకగానూ, గొంతు మార్గంలోనూ వదులుగా, బలహీనంగా ఉండే టిష్యూ ఒకటి ఉంటుంది. మనం నిద్రపోయినప్పుడు ఈ టిష్యూ బాగా రిలాక్సవుతుంది. నిద్ర ఎంత గాఢంగా ఉంటే ఈ టిష్యూ అంత బాగా రిలాక్సవుతుంది. రిలాక్సయినప్పుడు గాలికి ఈ టిష్యూ అదరడంవల్ల ఏర్పడే శబ్దమే గురక. శరీరం వాలి ఉన్నప్పుడూ, గాఢ నిద్రలో ఉన్నప్పుడూ ఈ టిష్యూవల్ల చాలా పెద్ద శబ్దం వస్తుంది. అయితే మనిషి గాఢంగా నిద్రపోతూండడంవల్ల అతడి గురక అతడికే వినిపించదు. కానీ కలత నిద్రలో సన్నగా వచ్చే గురకను మాత్రం గురక పెట్టే మనిషి కూడా వినగలడు. గురక జబ్బేమీ కాదు కానీ ఆ విషయం నిర్ణయించడానికి గురకకు కారణాలు తెలుసుకోవాలి. లావుగా ఉన్నవారిలో ఈ టిష్యూ కూడా పెద్దదిగా ఉండి పెద్ద శబ్దం సృష్టించే అవకాశముంది. ఆల్కహాలు పుచ్చుకునే వారిలో కూడా ఈ టిష్యూ మరింత రిలాక్సై పెద్ద గురకను పుట్టించవచ్చు. గురకకు కారణం రక్తపు పోటు కాదని నిర్ధారించుకోవడం కూడా అవసరం. కొందరిలో గురక కారణంగా ఊపిరి పీల్చుకోవడం కష్టమవుతుంది. అటువంటి వారికి గుండెజబ్బు వచ్చే ప్రమాదం. ఊపిరి పీల్చుకొనడం కష్టమై వారికి మాటిమాటికీ మేలకువ వస్తూంటుంది. అందువల్ల నిద్రలేమి కలిగి పగలంతా నిద్రమత్తుతో ఉంటారు వారు. అలాంటివారు వాహనాలను డ్రైవ్ చేస్తున్నప్పుడు రోడ్డు ప్రమాదాలు ఎక్కువగా జరుగుతాయట. అందువల్ల పెద్ద చప్పుడుతో గురక పెట్టేవారు బరువు, రక్తపుపోటు పెరగకుండా చూసుకోవాలి. ఆల్కహాలు పుచ్చుకోకూడదు. శస్త్ర చికిత్సవల్ల గురకను తగ్గించే ప్రయత్నం మంచిది కాదు. ఎందుకంటే గొంతులో గాలి వెళ్లడానికి అడ్డు ఉన్నదని సూచించేదే గురక. ఈ గురక కోట్లాది ప్రజలకున్నది కాబట్టి దీని గురించి పెద్దగా భయపడాల్సిందేమీ లేదు.

**ప్రశ్న: కాడ్‌లివర్ ఆయిల్ తీసుకోవడం పిల్లలకు మంచిదా?**

జవాబు: కాడ్ లివర్ ఆయిల్ చేప నుంచి తియ్యబడే ఒక నూనె. ఇందులో విటమిన్ ఏ, బీలు ఉంటాయి. దీన్ని తీసుకొనడంవల్ల గుండె జబ్బు వచ్చే ప్రమాదం తగ్గుతుందని ఇంగ్లండులో 55 సంవత్సరాలు పైబడిన వారందరూ నమ్ముతారు. అయితే ఇటీవల వాతావరణ కాలుష్యం బాగా పెరిగింది. పారిశ్రామిక కాలుష్యం నీటినీ తద్వారా చేపలనూ చేరుకోవడంవల్ల డై ఆక్సిన్, పోలీ కార్బనేటెడ్ బైఫినైల్ అనే రసాయనాలు చేపనూనెలలో కనబడుతున్నాయి. ఈ రసాయనాలవల్ల కాన్సర్ జబ్బు రాగల అవకాశముంది. ప్రస్తుతానికి

వసుంధర

చేప నూనెలలో ఈ రసాయనాలు ప్రమాదకర స్థాయికంటె తక్కువలోనే ఉన్నాయి. కానీ మన శరీరంలోకి కేవలం చేపనూనె వల్లనే ఈ రసాయనాలు చేరాలని లేదు కదా! ఇతర ఆహార పదార్థాలతో కలిపి వాటి మొత్తం ప్రమాదకరస్థాయికి చేరుకోకుండా జాగ్రత్త పడాల్సి ఉంది. అందువల్ల చిన్న పిల్లలకు కాడ్ లివర్ ఆయిల్ ఇచ్చే ముందు కాస్త ఆలోచించక తప్పదు. వాతావరణ కాలుష్యం అట్టేలేని ఆర్కిటిక్ ప్రాంతంలోని చేపల నుంచి తయారైన నూనె అయితే ఫరవాలేదు. లేదా- నదీజలాలను, సాగరజలాలను పరిశుద్ధంగా ఉంచే మార్గాలు అన్వేషించాలి.

**ప్రశ్న:** **దుమికే ముందు పరుగెత్తడం ఎందుకు?**

**జవాబు:** ఒక వస్తువును ఒకచోట ఉంచామనుకోండి. అది కదలకుండా అక్కడే ఉంటుంది. ఒక బంతిని దొర్లించామనుకోండి. గాలి కానీ, నేల రాపిడి కానీ మరేదైనా అవరోధంకానీ ఎదురు నిలిస్తే తప్ప అదలా కదులుతూనే ఉంటుంది. ఏ వస్తువైనా ఉన్న స్థితి నుంచి మారకపోయే గుణాన్ని జడత్వమంటాం. ఆంగ్లంలో దీన్ని ఇనర్షియా అంటారు. దీన్ని న్యూటన్ అనే శాస్త్రజ్ఞుడు గుర్తించి వివరించాడు. మానవ శరీరం కూడా ఒక పదార్థమే కదా! దాన్ని ఉన్న చోటనుంచి ఒక్క సారిగా దుమికించాలంటే జడత్వం ఎదుర్కుంటుంది. ఆ జడత్వాన్ని నిరోధించడానికి కొంత శక్తిని వినియోగించాలి. అలాకాక దూకాల్సిన చోటికి కొంతదూరం నుంచే పరుగు ప్రారంభిస్తే ఆ మానవశరీరం నిశ్చలన స్థితికి చలన స్థితికి చేరుకుని ఉంది. అంటే దుమికే చోటుకు వచ్చే సరికే అది చలన స్థితిలో ఉంది. అప్పుడు దుమికితే తక్కువ శక్తితో ఎక్కువ దూరం దుమకడం సాధ్యమవుతుంది. అంటే క్రీడలలో మనం చేసే విన్యాసాలు భౌతిక శాస్త్ర సిద్ధాంతాలపై ఆధారపడి ఉన్నాయన్నమాట!



ఈ ప్రక్కనున్న బొమ్మలోని వాళ్ళు ఏం మాట్లాడుకుంటే నవ్వు వస్తుందో, ఆ సంభాషణ వ్రాసి, ఈ సంచిక విడుదలైన వ[...] రోజులలోగా మాకు పంపకోరుతున్నాం. వాటిలో బాగున్న అయిదింటిని ఎన్నుకొని, ఒకదానికి రూ. 15/- పంపుతాం. సంభాషణలు కార్డుమీద మాత్రమే వ్రాసి పంపాలన్నది షరతు.

## బొమ్మల సంభాషణ

80, ధనలక్ష్మి కాలనీ, వడపలని, మద్రాసు-26.

Edited and published by Vijaya Bapineedu, 80, Dhanalakshmi Colony, Madras - 26. Phone: 4844499 and Printed by N. Navin Chandran at S.R. Offset Art Printers, Madras - 21. Phone: 5226462.

